Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు  స్థాపితం: 1930  జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 42 • 15-10-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# హస్తినలో రోశయ్యకు అవమానం!



సిద్దడు అద్దంకి పోయి వచ్చినట్లు రోశయ్య ఢిల్లీకి వెళ్లి వచ్చాడు. వెళ్లి ఏమి చేశాడన్న దానికి సమాధానం లేదు. అధిష్టానం ఆయన్ను పెద్దగా పట్టించుకోలేదు. రెండు నెలల విరామం తర్వాత వచ్చిన ముఖ్యమంత్రిని కలిసి ఏదో ఒకటి మాట్లాడకుంటే పత్రికలవాళ్లు చిలువలు పలవలు అల్లి కథలు వ్రాస్తారనే సంకోచంతో, మాటా మంతీ నడిపినట్లు నటించడం తప్ప రాష్ట్రంలోని పరిస్థితుల గురించి కనీసపాటి చర్చ కూడా జరపలేదు. సోనియాగాంధీ అయితే ముక్తసరిగా మూడంటే మూడు ముక్కలలో తేల్చి పారేసిందని వినికిడి. నాకన్నీ తెలుసు, సమయం వచ్చినప్పుడు చూద్దాం, మీరు వెళ్లిరండి అని మాత్రమే చెప్పిందట ఆమె. మంత్రివర్గ విస్తరణకు

## ● చేతులారా చేసుకొందే.

అనుమతి, జగన్ గోలకు ముగింపు వంటి వాటి మీద ఆమె ఒక స్పష్టత ఇస్తుందని భావించిన రోశయ్యకు నిరాశ ఎదురైంది. ఏమీ చెప్పకుండానే సాగనంపింది. సోనియా చెప్పని అంశాల గురించి ఆమె ప్రతినిధులు మాత్రం ఏమి చెప్తారు? అహ్మద్ పటేల్, వీరప్ప మొయిలీ వంటివారి వద్ద కూడా అదే మక్తసరి ముచ్చట్లు. వీరప్ప మొయిలీ దగ్గరకు రోశయ్య వెళ్లేటప్పటికే, కెవిపి రామచంద్రరావు కూర్చుని వున్నాడట. రోశయ్య మంత్రివర్గ విస్తరణ ప్రస్తావన తేగానే, వీరప్ప మొయిలీ కంటే ముందుగా కెవిపి జోక్యం చేసుకొని ఇప్పట్లో దాని వూసెత్తవద్దని గట్టిగా వాదించాడట. ఆ వాదనకు వీరప్ప కూడా తలవూపాడని తెలుస్తున్నది. దీని అర్థం ఆయన దృష్టిలో ఇప్పటికీ ముఖ్యమంత్రిగా రోశయ్యకు గుర్తింపు లేదని భావించవచ్చు. వైఎస్ ప్రతినిధిగా కెవిపికి ఇచ్చిన ప్రాధాన్యత, రోశయ్యకు ఇవ్వడం లేదని అందరికీ అర్థమై పోతున్నది.

ఎందువల్ల ఈ పరిస్థితి? కేవలం ఆపద్ధర్మంగా అధికారంలోకి వచ్చిన రోశయ్య మీద మొదట మొదట ఢిల్లీ పెద్దలందరూ అపారమైన సానుభూతి చూపారు. ఆయనకు ఏ ఇబ్బంది వచ్చినా గోడ కట్టినట్లు అడ్డం నిలబడ్డారు. సోనియాతోపాటు చిదంబరం, ప్రణబ్ ముఖర్జీ, అహ్మద్ పటేల్ వంటి వారంతా ఆయనకు కొండంత అండ కల్పించారు. కానీ దాన్ని రోశయ్య సద్వినియోగం చేసుకోలేదు. ఏదో ఒక కుంటిసాకుతో మంత్రివర్గ విస్తరణ వాయిదా వేసి, కఠినమైన నిర్ణయాలు తీసుకోవాల్సిన సందర్భాలలో నాన్పుడు వైఖరి అవలంభించి, తప్పు జరిగితే దాన్ని ఢిల్లీ పైకి నెట్టి, నా పదవి నాకుంటే చాలు, ఎవరెట్లా పోతే నాకేమి అన్న ధోరణిలో ప్రవర్తించారు. ఈ నిర్లిప్తవైఖరి అధిష్టానానికి బాగా విసుగు తెప్పించింది. ఆయన మీద నమ్మకాన్ని పోగొట్టింది. రోశయ్యను ముఖ్యమంత్రిగా కొనసాగించడం పార్టీకి క్షేమం కాదన్న నిర్ణయానికి అధిష్టానం వచ్చినట్లు స్పష్టంగా అర్థమై పోతున్నది. కానీ వేరే ప్రత్యామ్నాయం ఏదీ లేదు కాబట్టి, కొంతకాలం గుర్రం గుడ్డిదైనా, కుంటిదైనా స్వారీ తప్పదన్న ధోరణి వ్యక్తం చేస్తున్నది అధిష్టానం. రెండు నెలల సుదీర్ఘ విరామం తర్వాత తమ వద్దకు వచ్చిన ముఖ్యమంత్రి పట్ల ఢిల్లీ పెద్దలు అంటీ ముట్టనట్లు వ్యవహరించడానికి ఇంతకంటే వేరే కారణం ఏదీ కన్పించడం లేదు.

అయితే ఈ ఢిల్లీ పర్యటన వైఫల్యం ప్రభుత్వ పని తీరు మీద తీవ్ర ప్రభావం చూపించవచ్చునంటున్నారు పరిశీలకులు. ముఖ్యమంత్రి స్థిరంగా లేడని తెలిస్తే ఒక్క ఐఎఎస్ అధికారి కూడా మాట వినడు. రోశయ్యకు రాజకీయంగా స్వంత మనుషులు లేరు. దగ్గరకు రావడానికి ప్రయత్నించిన డిఎల్.రవీంద్రరెడ్డి, జెసి.దివాకర్‌రెడ్డి వంటి వారిని ఆయన దూరం చేసుకొన్నాడు. జగన్‌తో పొత్తు

కొరవ 14వ పేజీలో

# ప్రసన్న పాపం పండింది!

కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డికి పార్టీ ఫిరాయింపు చట్టం క్రింద సంజాయిషీ నోటీసు జారీ చేశాడు శాసనసభ స్పీకర్ కిరణ్‌కుమార్‌రెడ్డి. గత ఎన్నికలు ముగియగానే, బ్యాలెట్ పత్రాల మీద సిరా గుర్తు కూడా ఆరక ముందే, వైఎస్.రాజశేఖర్‌రెడ్డి సంకల్పించిన ఆపరేషన్ ఆకర్ష్ పథకం క్రింద కాంగ్రెస్‌కు సలాం కొట్టాడు ప్రసన్న. పది కోట్ల రూపాయల సొమ్ము, నియోజకవర్గంలో అధికార ఎమ్మెల్యేగా రాజభోగాలు ఆయన కుదుర్చుకొన్న బేరం. వైఎస్ బ్రతికి వుండి వుంటే, గతంలో టిఆర్ఎస్ ఎమ్మెల్యేల వలె, ఐదేళ్లలో ఫిరాయింపు చట్టం వేటు పడకుండా ఏదో ఒక రూపంలో కాపాడి వుండేవాడేమో.

కానీ ఇప్పుడా పరిస్థితి లేదు. పార్టీ మీద తిరుగుబాటు చేసిన 11 మంది బిజెపి ఎమ్మెల్యేలకు కర్నాటక స్పీకర్ ఉద్వాసన చెప్పడంతో, మన స్పీకర్ మీద కూడా ఒత్తిడి పెరిగింది. జగన్ ఓదార్పు యాత్రలో పాల్గొంటున్న ప్రసన్నను ఫిరాయింపు చట్టం క్రింద సభ నుంచి వెలి వేయాలని తెలుగుదేశం నేతలు చేసిన ఒత్తిడికి తలొగ్గి, ఈ నోటీసు జారీ చేశారాయన. అయితే ఇది నోటీసు వరకు పరిమితమా లేక నిజంగానే ఎమ్మెల్యే పదవి వూడబెరకతారా అన్నది స్పీకర్ నిర్ణయం మీద ఆధారపడి వుంటుంది. ఆయన

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




ఇదేంటి మావా... జగన్ ఆస్తుల్లాగా ఎంత లాగినా అంతు తెలియట్లేదు...!

# జగన్‌కు ఆనం కితాబు!

తమ జిల్లాలో జరిగే వైఎస్.జగన్ ఓదార్పు యాత్ర దిగ్విజయం కావడం ఖాయమని, దాన్ని ఎవరూ అడ్డుకోలేరని అభిప్రాయపడ్డాడు మునిసిపల్ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి. 12తేది అసెంబ్లీ ఆవరణలో పత్రికల వారితో ఆఫ్ ది రికార్డు షరతుపై మాట్లాడుతూ, జగన్‌ను ఆకాశానికెత్తేశాడు రామనారాయణరెడ్డి. మేమంతా వైఎస్ భక్తులం, కానీ ఇప్పుడు రోశయ్య ప్రభుత్వంలో వున్నాము కాబట్టి ఏమీ మాట్లాడలేకపోతున్నాము, ప్రజలు వైఎస్.రాజశేఖర్‌రెడ్డి చేసిన మేలు మరచి పోవడం లేదు, అందువల్ల జగన్‌కు ప్రజలు మా జిల్లాలో కూడా బ్రహ్మరథం పడుతారు, మంత్రి పదవి కాపాడుకోవడం కోసమే మేము ఆ యాత్రకు దూరంగా వున్నాము తప్ప, మా మనసు మాత్రం అటే వుంది అన్నాడు రామనారాయణరెడ్డి. ఆయన మాటల్లోని అంతరార్థం ఏమిటో, వాటి వెనుక వున్న మతలబు ఏమిటో అర్థం కాక జుట్టు పీక్కొన్నారు విలేఖరులు. మనసొక చోట, మనువొక చోట అన్న దొంగ నాటకాలు ఆనం వారికి వెన్నతో పెట్టిన విద్య. రెండు పడవలలో సీటు కాపాడుకోవడం వారి నైజం. భవిష్యత్తులో ఎందుకైనా మంచిదనే ఆలోచనతోనే జగన్‌కు ఇంత పెద్ద కితాబు ఇచ్చాడనుకోవడం తప్పు కాదేమో.

# రుణ రూప రాక్షసులు

మైక్రో ఫైనాన్స్ సంస్థల అరాచకాలు, ఆగడాలు శృతిమించి పోతున్నాయి. వీటి దగ్గర తీసుకొన్న చిన్నపాటి అప్పులు చెల్లించలేక, వారి ఒత్తిడి తట్టుకోలేక మన రాష్ట్రంలో ఇప్పటి వరకు 30 మందికి పైగా నిరుపేద నిర్భాగ్యులు ఆత్మహత్యలు చేసుకొన్నారు. విశాఖపట్నం వంటి చోట్ల మైక్రో ఫైనాన్స్ ప్రతినిధులు గూండాల కంటే హీనంగా ప్రవర్తిస్తున్నట్లు వార్తలొస్తున్నాయి. అప్పుల వసూలు పేరుతో యువతులను, పసిపిల్లలను అపహరించడం రివాజుగా మారింది. ఆత్మహత్యలు చేసుకొన్నవారి ఇళ్ల మీద కూడా దాడులు చేసి, తమ అప్పు తీర్చిన తర్వాతే శవానికి ఎత్తుబడి చేయాలని నిర్బంధిస్తున్నారట ఈ రుణ రూప రాక్షసులు. నర రూప రాక్షసుల కంటే దారుణంగా ప్రవర్తిస్తున్నారు వారు. ఎంతో ఉదాత్త ఆశయంతో, సేవాభావంతో నడవాల్సిన మైక్రో ఫైనాన్స్ వ్యవస్థ ఇంతటి భ్రష్ట రూపం సంతరించుకోవడం దురదృష్టకరం. దానికి కారణం రిజర్వు బ్యాంక్ విధానాల వైఫల్యం.

నిరుపేదల బ్రతుకులలో చిరుదివ్వె వెలిగించడానికి బంగ్లాదేశ్‌లో మహమ్మద్ యూనస్ కనిపెట్టిన మహోపకారం – మైక్రోఫైనాన్స్. చిట్టగాంగ్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న సమయంలో, గ్రామీణ ప్రాంతాలలోని పేదల దుర్భర జీవితాలను దగ్గరగా చూసిన ఆయన, ఈ ప్రక్రియకు శ్రీకారం చుట్టారు. గ్రామాలలోని మహిళలు, మరీ ముఖ్యంగా యువతులు తమ కాళ్ల మీద నిలబడడానికి తగిన అర్హతలు, నైపుణ్యం కలిగి కూడా ఆర్థిక సహాయం చేసేవారు లేక అణగారి పోవడాన్ని గమనించారాయన. వారికి ఎట్లయినా తోడ్పాలనే ఉద్దేశంతో ఎంతో పరిశోధన చేసి ఈ ప్రక్రియ కనిపెట్టారు. ఐదుగురు మహిళలను ఒక బృందంగా ఏర్పరచి, వారికి నేర్పరితనం వున్న ఉపాధిని ఎంచుకొనే స్వేచ్ఛ కలిపించి, అందుకవసరమైన ఆర్థిక సహాయం చేయడం దీని లక్ష్యం. అప్పులివ్వడానికి మహిళలు బృందాలుగా ఏర్పడినప్పటికీ, ఎవరి అప్పుకు వారే బాధ్యులు. బృందంలోని సభ్యులు ఒకరితో ఒకరు సలహా పడి, జీవనోపాధి మెరుగుపరచుకోవడం కోసమే బృందం ఏర్పాటు తప్ప, ఒకరి అప్పును మరొకరు కట్టాలన్న హామీ కోసం కాదు. అప్పుకు ఎటువంటి హామీ అవసరం లేదు. అయితే, పిల్లలను తప్పనిసరిగా బడికి పంపించడం, ఆరోగ్య సూత్రాలు పాటించడం, పారిశుధ్యం మెరుగుపరచుకోవడం వంటి 16 నియమాలు పాటించిన వారికే అప్పులిస్తారు. దీని ఉద్దేశం, ఆ నిరుపేద, నిరక్షరాస్య జీవులకు మెరుగైన జీవితం అందించడం మాత్రమే. అప్పులిచ్చే బ్యాంక్, రుణగ్రహీతల నుంచి కనీసపాటి వడ్డీ మాత్రమే వసూలు చేస్తుంది. ఒకవేళ ఆ వడ్డీ వల్ల సంస్థకు లాభం వస్తే, దాన్ని కూడా ఆ మహిళలకే పంచుతారు. బంగ్లాదేశ్‌లో ఈ ప్రయోగం వూహించిన దాని కంటే అధికంగా విజయవంతమైంది. ప్రపంచంలోని పలు దేశాలు ఆ నమూనాను తమ తమ గ్రామాలలో అమలు చేస్తున్నాయి. మహమ్మద్ యూనస్ మీద నమ్మకంతో పలు అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు వీరికి కనీస వడ్డీకి, కొన్ని సందర్భాలలో ఉచిత నిధులు కూడా అందించాయి.

ఇంతటి సదాశయంతో తలపెట్టిన మైక్రో ఫైనాన్స్ వ్యవస్థను మన దేశంలో భ్రష్టు పట్టిస్తున్నారు. పేదల రక్తం పీల్చే జలగల వంటి వడ్డీ వ్యాపారులు ఈ రంగంలోకి ప్రవేశించడానికి రిజర్వు బ్యాంక్ అనుమతించడమే అందుకు కారణం. గ్రామీణ పేదల నుంచి నూటికి నాలుగు నుంచి ఐదు రూపాయల వడ్డీ గుంజుతున్నాయి ఈ సంస్థలు. పేదల రుణ అవసరాలు తీర్చే సదుద్దేశంతో కాకుండా, వారితో అధిక వడ్డీ వ్యాపారం చేసే లక్ష్యంతో నడుస్తుండడం వల్లనే ఇన్ని అనర్థాలు జరుగుతున్నాయి. దాదాపు 30 మంది నిర్భాగ్యులు ప్రాణత్యాగం చేసిన తర్వాత, వేలాది కుటుంబాలు వీధినపడిన తర్వాత కళ్లు తెరిచింది రాష్ట్ర ప్రభుత్వం. మైక్రో ఫైనాన్స్ ఆగడాలను కట్టడి చేయడానికి ప్రత్యేక ఆర్డినెన్స్ తెస్తున్నది. కనీసం ఇప్పుడైనా రిజర్వు బ్యాంక్‌కు కనువిప్పు కలిగి, మైక్రో ఫైనాన్స్‌ను ఒక వ్యాపారంగా కాక, ఒక సేవగా భావించే వారికే అనుమతులివ్వడం అవసరం. దాని ద్వారా పేదల బ్రతుకులు బాగుపడాలే తప్ప, మరింత చితికి పోకూడదు.

జమీన్‌రైతు

## జనవాణి

### ఎవరూ మిగలరు?

పిసిసి కార్యదర్శి కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డిని కాంగ్రెస్ పార్టీ నుంచి సస్పెండ్ చేయడం దురదృష్టకరం. జగన్ వెంట నడిచే వారిని సస్పెండు చేసుకుంటూ పోతే కాంగ్రెస్ పార్టీలో కార్యకర్తలే మిగలరు. జగన్ కాంగ్రెస్ పార్టీ అమ్ములపొదిలో పాశుపతాస్త్రం. ఆ అస్త్రాన్ని జాగ్రత్తగా కాపాడుకొని సరియైన పద్ధతిలో వినియోగిస్తే 2014 ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ ఆంధ్రప్రదేశ్‌లో విజయఢంకా మోగిస్తుంది. అలా కాకుండా ఆ అస్త్రాన్ని నిర్వీర్యం చేయాలనుకొంటే 2014 ఎన్నికల్లో గెలవడం కల్ల.

బొబ్బల శ్రీనివాసయాదవ్ — నెల్లూరు

### మనో విశ్లేషకుల సహకారం తీసుకోవాలి

నేర ప్రవృత్తి, నేరాల సంఖ్య ప్రస్తుతం చాలా ఆందోళన కల్గిస్తుంది. వీటిని అరికట్టే చర్యల్లో భాగంగా అమెరికా, ఐరోపా దేశాలలో వలె వృత్తిపరమైన మానసిక విశ్లేషకుల కౌన్సిలింగ్ ద్వారా సమాజంలోని అన్నివర్గాల ప్రజల సమస్యలు పరిష్కరించేలా క్లినిక్కులను స్థాపించాలి. అంతేగాక నేరస్తులను పోలీస్ స్టేషన్లలో విచారించేటప్పుడు మానసిక నిపుణులు, సాంఘిక శాస్త్రవేత్తల సహకారం తీసుకోవాలి. నేర ప్రవృత్తికి దోహదపడే పరిస్థితులను విశ్లేషించి నేరస్తులను సంస్కరించి వారికి పునరావాసం కల్పించే అవకాశాలను పరిశీలించాలి.

ఆలూరి ఆత్మానందం — నెల్లూరు

### నల్లపరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి విగ్రహం పెట్టండి!

నెల్లూరు పొదలకూరురోడ్డులో కొత్తగా నిర్మిస్తున్న జడ్పీ భవనం ప్రాంగణంలో జిల్లా పరిషత్ మాజీ ఛైర్మన్ నల్లపరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి విగ్రహాన్ని పెట్టించ మనవి. దీనికిగాను మొదటి విరాళం ఇప్పటి ఛైర్మన్ కాకాణి గోవర్ధన్ రెడ్డి ఇవ్వాలి. జడ్పీటీసి, ఎమ్పీపిలు కూడా ఒక నెల జీతం విరాళంగా ఇస్తే బ్రహ్మాండమైన కాంస్య విగ్రహం పెట్టొచ్చు. జడ్పీ కొత్త భవనానికి కూడా నల్లపరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి పేరు పెడుతున్నందుకు గోవర్ధన్‌రెడ్డికి అభినందనలు.

పి.రాంసాగర్ — తోడేరు

### శంకరన్ సేవలు వర్ణనాతీతం!

నెల్లూరు జిల్లా మాజీ కలెక్టర్ ఎస్.ఆర్.శంకరన్ మరణించారన్న వార్త

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

18-10-1940
పేజీలు : 16 వెల: అణా

### మందసా కాల్పుల కేసు

మందసా కాల్పుల కేసు అపీలు జస్టిస్ లక్ష్మణరావుగారి వద్ద దాఖలు చేయబడింది. డిఫెన్సు వకీలు బి.జగన్నాధంగారు ముద్దాయిల తరపున జామీను పిటిషన్ దాఖలు చేశారు. కోర్టులో జామీన్ మీద విడుదల చేయమని ఉత్తర్వుకాబడింది. బహుశా ఈనెల 11తేది ముద్దాయిలు జైలు నుండి విడుదల కావచ్చు.

### భగవాన్లు కేసు

జమీన్‌రైతు మద్రాసు బ్రాంచి మేనేజరు డి.సూర్యభగవాన్లు గారి కేసు డిఫెన్సు విచారణకు ఈనెల 28తేది వాయిదా పడింది.

### నెల్లూరు ముచ్చట్లు

సౌత్ స్టేషన్ ప్లాటుఫారం సన్నగాను, తగ్గుగాను వున్నందున 5తేది సాయంత్రం కావలి ప్యాసింజరులో దిగిన ఒక వృద్ధ స్త్రీ పడి పక్కనున్న 10, 12 అడుగులు అగాధంలోకి దొర్లుకపోయినది. రైల్వే అధికారులు వెంటనే సరిచేయకపోతే చాలా ప్రమాదాలు సంభవిస్తవి.

* * *

ఏటికి నీళ్లు వచ్చినప్పుడు రైల్వే బ్రిడ్జి మీద రుసుం వసూలు చేసి ప్రయాణీకులను నడిపిస్తున్నారు. మొన్నొక నాడు బ్రిడ్జి మీద మనుషులు నడుస్తుండగా ట్రయిను వచ్చిందని సడన్‌గా ఆపకుంటే ప్రమాదం జరిగుండేదని ఇంద్రగంటి చెప్పాడు.

ఈ పద్ధతి ప్రమాదకరం కాబట్టి పోలీసులు జాగ్రత్త పుచ్చుకోవాలె.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

14-10-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నైరాశ్యంలో ఏ.సి

ఎందువల్లనో ఏ.సి సుబ్బారెడ్డిగారు చాలా నిరుత్సాహంగా కనబడుతున్నారు. ఎలక్షన్ కమిటీ ఎన్నికలో యూనిటీ ఫ్రంటు విజయం పొందినప్పటి నుండి ఈ విలేఖరి సుబ్బారెడ్డిగారిని మూడు, నాలుగు దఫాలు కలసుకొన్నాడు. వారిలో విజయం వెంటనే ద్యోతకమైన వుత్సాహం, ఆ తర్వాత లేదు.

ఫ్రంటు ప్రచారానికి పోవాలని గెలుపు తమదేనని చెప్పుండిన సుబ్బారెడ్డిగారిలో రాజకీయ నైరాశ్యం తొణికిస లాడుతున్నది. తాను 1962 వరకే రాజకీయాలలో వుంటానని, అది గూడా నామకార్థమేనని వారన్నారు. సుబ్బారెడ్డి గారిలో ఒక్కసారిగా కలిగిన ఈ విరాగానికి కారణమేమి?

ఎలక్షన్ కమిటీ ఎన్నిక తదనంతర పరిణామాలు, యూనిటీఫ్రంటు రాజకీయాలు సుబ్బారెడ్డిగారి నైరాస్యానికి కారణాలుగా వుంటాయని మా వూహ. సుబ్బారెడ్డి గారికి సరే సంజీవయ్య, సత్యనారాయణ రాజు గారలతో వివాదపడుటకు కారణమున్నది. కాని బ్రహ్మానందరెడ్డి ప్రభృతులు అధికారవర్గంలో ఘర్షణ పడుటకు కారణమేమి అనేది ఆలోచనకు అందడం లేదు.

### పదేళ్ల ముస్లిం బాలిక హత్య

నెల్లూరు సిపిఎం హైస్కూలుకు సమీపంలో కాపురముండే ప్యారేజాన్ పదేండ్ల కుమార్తె రజియాబీ శవం, నెల్లూరు పొదలకూరు రోడ్డు 2వ మైలు 4వ ఫర్లాంగులో రోడ్డుకు పడమరగా 10గజాల దూరంలో పొదలో, 12తేది ఉదయం కనుగొనబడింది.

ఆ అమ్మాయి వంటి మీద వుండిన షుమారు 30రూపాయల విలువ జేసే కమ్మలు, ముక్కు పుడక, కాలి కడియాల కొరకు ఈ హత్య జేసినట్లు అనుమానింప బడుతున్నది.

# నెల్లూరు ముచ్చట్లు

## జగన్ ఓదార్పు ప్రారంభం

గత 50 రోజులుగా ఇప్పుడప్పుడని వాయిదా పడుతుండిన కడప ఎమ్పీ వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఓదార్పు యాత్ర జిల్లాలో ఎట్టకేలకు ప్రారంభమయ్యింది. కావలికి సమీపంలోని రుద్రకోట దళిత కాలనీలో వైఎస్ రాజేశఖర్‌రెడ్డి విగ్రహావిష్కరణ అనంతరం వెంకటేశ్వర్లు కుటుంబాన్ని ఓదార్చడంతో యాత్ర మొదలయ్యింది. ఈ యాత్ర జిల్లాలో మాసం రోజులపాటు జరుగుతుంది. 500లకు పైగా గ్రామాల్లో 400లకు పైగా రాజశేఖర్‌రెడ్డి విగ్రహాలను జగన్ ఆవిష్కరిస్తారు. వైఎస్ చనిపోయాక బాధ తట్టుకోలేక చనిపోయిన 36 కుటుంబాలను ఓదార్చుతారు.

యాత్రలో విచిత్రంగా చెప్పుకోవాల్సింది కావలిలో కలికి యానాదిరెడ్డి విగ్రహాన్ని వైఎస్ జగన్ ఆవిష్కరించడం. చాలా రోజుల క్రితం ఏర్పాటుచేసిన ఈ విగ్రహాన్ని వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఆవిష్కరించాలి. కానీ ఆయనకు తీరిక దొరకలేదు. ఇప్పుడు ఈ ఆవిష్కరణ జగన్ చేతుల మీదుగా అయ్యిందంతే.

## జగన్‌ను విస్మరిస్తే అంతే...

రాష్ట్రంలో పెద్ద నోరుగల రాజకీయ నేతగా గుర్తింపు కల్గిన ఆర్టీసి మాజీ ఛైర్మన్ గోనె ప్రకాశరావు జగన్ యాత్రను పురస్కరించుకొని 12వ తేది నెల్లూరు వచ్చారు. రాజీవ్‌భవన్‌లో విలేకరులతో మాట్లాడారు. రాష్ట్రంలోని కాంగ్రెస్ పెద్దలు వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని విస్మరిస్తే పార్టీ పశ్చిమ బెంగాల్, ఉత్తర ప్రదేశ్, తమిళనాడు, బీహార్ రాష్ట్రాలలో దెబ్బతిన్నట్లు ఇక్కడా దెబ్బతింటుందన్నారు. పార్టీ సీనియర్లు కె.కేశవరావు, వి.హనుమంతరావు, జైపాల్‌రెడ్డిలు అదే పనిగా జగన్‌పై అధిష్టానం వద్ద చాడీలు చెప్పడాన్ని తప్పుపట్టారు. నెల్లూరులో ఆనం సోదరులు అధికారం శాశ్వతం కాదని తెలుసుకొనే రోజు త్వరలోనే వస్తుందన్నారు. వాళ్ల కుటుంబ రాజకీయ చరిత్ర గొప్పది కాదని జనతా పార్టీ, ఆ తర్వాత తెలుగుదేశం, ఇప్పుడు కాంగ్రెస్‌లో కొనసాగుతున్నారని దెప్పి పొడిచారు.

## పాపాత్ములైపోతారు

జిల్లాలో ఓదార్పు ప్రారంభం సందర్భంగా ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి చేసిన వ్యాఖ్యలు దుమారం రేపాయి. ఆయన విలేకరులతో మాట్లాడుతూ జిల్లాలోని పార్టీ పెద్దలు యాత్రకు సహకరించాలి. ఓదార్పుకు మద్దతు ఇచ్చి రుణం తీర్చుకోవాలి. వైఎస్ మూలంగా రాజకీయంగా పదవులు పొందడంతోపాటు వివిధ ప్రయోజనాలు పొందినవారు యాత్రకు మద్దతు ఇవ్వాలి. ఓదార్పులో పాల్గొనని వారు పాపాత్ములుగా మిగిలిపోతారని వ్యాఖ్యానించారు.

## కాలం నిర్ణయిస్తుంది

ఓదార్పు యాత్రలో పాల్గొనని వారు పాపాత్ములై పోతారని ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి వ్యాఖ్యానించడంపై రాష్ట్ర సమాచార మంత్రి ఆనం రామనారాయణరెడ్డి స్పందించారు. 11వ తేది ఈ విషయమై నెల్లూరులో విలేఖరులతో మాట్లాడారు. ఓదార్పులో పాల్గొని ఆ పుణ్యం మొత్తాన్ని మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డినే మూటగట్టుకోమనండి. మేము పాపాత్ములమో... పుణ్యాత్ములమో భవిష్యత్తు నిర్ణయిస్తుంది. కాంగ్రెస్ పార్టీలో బాధ్యతాయుతమైన పదవిలో వున్నాం. అధినాయకత్వం నిర్ణయం మేరకే నడుచుకోవాలి. రాజకీయాల్లో ఓడలు బండ్లు, బండ్లు ఓడలవుతాయి. ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొని రాజకీయాల్లో ఈ స్థాయికి చేరామని మంత్రి స్పష్టం చేశారు.

## ఆయన మంచోడు - మా బావ చెడ్డోడు!

మరోసారి కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తన బావ, తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిపై నిప్పులు చెరిగాడు. 11వ తేది నెల్లూరు దర్గామిట్టలోని తన స్వగృహంలో విలేకరులతో మాట్లాడుతూ ఆయనకు సంస్కారం లేదు. రాజకీయాల్లో కుట్రలు, కుతంత్రాలు చేయడంలో దిట్ట. రాష్ట్ర తెలుగు యువత అధ్యక్షుడు బీద రవిచంద్ర మంచి సాంప్రదాయాలున్న నేత. ఎవరో చెబితే తనను విమర్శిస్తూ మాట్లాడాడని చెప్పుకొచ్చారు.

## దాతల పేరు లేదు!

నెల్లూరు రాజరాజేశ్వరి దేవస్థానంలో వంటశాలను నిర్మించిన దాతకు పాలకులు పెద్ద గౌరవమే ఇచ్చారు. వదాన్యులు పాతూరు అమ్మణమ్మ, కుమారస్వామి దేవస్థానంలో రూ.3.50 లక్షలు వెచ్చించి వంటశాలను నిర్మించారు. 11వ తేది సాయంత్రం మంత్రి ఆనం రామనారాయణరెడ్డి దీన్ని ప్రారంభించారు. కానీ శిలాఫలకంపై దాతల పేర్లు లేకపోవడంతో వారు ఆవేదన వ్యక్తం చేశారు. కానీ ఈ వ్యవహారాన్ని పెద్దది కాకుండా అక్కడి పెద్దలు దాతల నోరు మూయించినట్లు తెలిసింది.

## జోష్‌లో సోమిరెడ్డి!

గతవారం పదిరోజులుగా జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ప్రతిపక్ష నేత పదవికి వన్నె చేకూర్చేలా జిల్లాలో పలు విషయాలపై నేతలు, అధికారులను తూర్పారబట్టారు. తన ప్రధమ శత్రువు సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి సహకారంతో వెంకటాచలం మండలం అబ్బిసాహెబ్ కండ్రిగలో ఇరిగేషన్ కాల్వను పూడ్చి రియల్‌ఎస్టేట్ వ్యాపారం ప్రారంభించడంపై, దీనికి సహకరించిన ఇరిగేషన్ ఎస్ఇ, ఈ వ్యవహారాన్ని పట్టన్నట్లు వదిలేసిన జిల్లా కలెక్టర్‌ను తూర్పారబట్టారు.

కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి మళ్లీ చంద్రబాబు నాయుడికి లేఖ వ్రాయడంతో ఆయన్ను తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు.

జిల్లాలో డెంగ్యూ జ్వరం ప్రబలి 300 మంది ప్రాణాలు కోల్పోతే వైద్య ఆరోగ్య శాఖాధికారి ఎనిమిది మందే చనిపోయారని పేర్కొనడం దారుణమని విమర్శించారు. జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, నెల్లూరు ఎమ్పీ రాజమోహన్‌రెడ్డికి ఈ మరణాలు పట్టకపోవడం దారుణమన్నారు. జిల్లా కలెక్టర్ రాంగోపాల్ వ్యవహారసరళిపై చంద్రమోహన్‌రెడ్డి చురకలంటించారు. ఎవరో

కొరవ 14వ పేజీలో

## విందు విలాసాల్లో బిజీ!

**జిల్లా ఉన్నతాధికారుల తీరిది**

మద్య సేవనం ఆపమంటూ ఒక వైపు తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు చంద్రబాబునాయుడు, మరోవైపు ప్రజారాజ్యం పార్టీ ఎమ్మెల్యేలు, కార్యకర్తలు రాష్ట్ర వ్యాప్తంగా విస్తృత ప్రచారం చేస్తున్నారు. కాని రాష్ట్రంతోపాటు జిల్లాలో మద్య పాన అమ్మకాలు ఏమాత్రం తగ్గట్లేదు. విచ్చలవిడిగా బెల్ట్‌షాపులు నడుస్తున్నా ప్రొహిబిషన్ అండ్ ఎక్సైజ్‌శాఖ ఏమీ పట్టన్నట్లుంది. మద్యం అమ్మకాలకు ఎక్సైజ్ శాఖకు పోలీస్‌శాఖ కూడా బాగా సహకరిస్తోంది. దీని మూలంగానే నెల్లూరు నగరంలో బ్రాందీషాపులు, బార్లు అర్ధ రాత్రి వరకు నడుస్తున్నాయి.

విచిత్రమేమిటంటే జిల్లా వున్నతాధికారుల్లో ఒక బ్యాచ్ మద్యపాన ప్రియులుగా తయారయ్యారు. ఈ అలవాటు వల్ల అత్యవసర సమయాల్లో అత్యవసర విషయాలు వీరి దృష్టికి తీసుకెళ్లలేని పరిస్థితి ఏర్పడిందని ప్రజాప్రతినిధులు, అధికారులు నెత్తి నోరు బాదుకొంటున్నారు. ప్రతిరోజు చీకటి పడ్డాక పార్టీల్లో మునిగి తేలుతున్న అధికారులు వెరైటీ కోసమంటూ ఈ మధ్య జిల్లాలోని పర్యాటక, విహార కేంద్రాలకెళ్లి అక్కడ పార్టీలు చేసుకొంటున్నారు. ఇటీవల నెల్లూరుకు దగ్గరగా వుండే పుణ్యక్షేత్రంలో ఇటువంటి పార్టీ జరిగింది. మరో ఇద్దరు ఉన్నతాధికారులైతే ఓ కారులోనే ఈ పార్టీలకు వెళ్తున్నట్లు గగ్గోలుగా వుంది. అధికారుల మద్యపాన సేవనం వ్యక్తిగత విషయమే. కాని పబ్లిక్‌లో పార్టీలు అంత సబబా? మద్యపాన ప్రియులైన అధికారులు ఆలోచిస్తే బాగుంటుంది.

## పరువుతీస్తున్న ప్రసన్న

### నల్లపరెడ్డి కుటుంబ అభిమానుల ఆవేదన



జిల్లాలోని రాజకీయ కుటుంబాల్లో పాతవి బెజవాడ, రేబాల, దొడ్ల, నేదురుమల్లి, నల్లపరెడ్డి, ఆనం, మాగుంట కుటుంబాలు. ఈ మధ్య వెలుగు వెలుగుతున్న కుటుంబం మేకపాటిదిగా చెప్పుకోవచ్చు. బెజవాడ, రేబాల, దొడ్ల కుటుంబీకులు ఇప్పుడు రాజకీయాల్లో లేరు. నేదురుమల్లి అప్పుడు ఇప్పుడు కాంగ్రెస్ పార్టీ విధేయునిగానే కొనసాగుతున్నారు. గాలివాటంగా ఆనం కుటుంబీకుల రాజకీయం సాగుతుండగా, స్వర్గీయ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి కుటుంబీకునిగా అతి చిన్న వయస్సులోనే ఎమ్మెల్యే, మంత్రిగా కూడా పనిచేసిన ప్రసన్నకుమార్‌రెడ్డి దిగజారి వ్యవహరిస్తున్న రాజకీయశైలి వల్ల ఆ కుటుంబ అభిమానులు విపరీతంగా బాధపడుతున్నారు. మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో గెల్చిన ప్రసన్న రాజశేఖర్‌రెడ్డి ఆపరేషన్ ఆకర్ష్‌కు లోనయ్యారు. అడ్వాన్స్ ముట్టడంతో చంద్రబాబును విమర్శిస్తూ లేఖ వ్రాశారు. ఆ తర్వాత వైఎస్ మరణించాక జగన్ పంచన చేరారు. జిల్లాలో జగన్‌యాత్ర ఏర్పాట్లు చేస్తూ వారి కుటుంబ స్థాయిని దిగజార్చారు. సొంత ఊరు కోట, రాజకీయంగా ఆదరించిన కోవూరులో తండ్రి నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి విగ్రహం పెట్టని ఆయన ప్రస్తుతం వైఎస్ విగ్రహావిష్కరణల్లో బిజీగా వున్నారు. 9తేది చంద్రబాబును విమర్శిస్తూ మళ్లీ ఉత్తరం వ్రాసిన ప్రసన్న ఎంఎస్ చదివిన తన కుమారుడ్ని సైతం జగన్ యాత్రలో నియోజకవర్గంలో తిప్పుతున్నారు. ప్రసన్న వ్యవహారశైలిపై తెలుగు నేత సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి తీవ్రంగా విరుచకపడ్డారు. తన మామ స్వర్గీయ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి కడుపున ప్రసన్న చెడబుట్టాడంటూ ఆవేదన వ్యక్తం చేశారు. ఎవరు ఎన్ని అనుకున్నా ప్రసన్న మాత్రం తనకున్న బలహీనతలను తీర్చుకోను డబ్బిచ్చే వారి వెంట నడుస్తూ జిల్లా రాజకీయాల్లో తనస్థాయిని దిగజార్చుకొంటున్నారు.

**పోలీసులే ఛేదించాలి**

## మిస్టరీగా మహిళా న్యాయవాది హత్య



న్యాయవాది అనూరాధను చంపిందెవరు?

నెల్లూరు మిలటరీ కాలనీకి చెందిన న్యాయవాది అనూరాధ (45) 8తేది కనుపర్తిపాడు గ్రామ శివార్లలో అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించి వుండడం సంచలనం సృష్టించింది. న్యాయవాది వృత్తిమాని స్వంత ఇంట్లోనే బ్యూటీపార్లర్ నిర్వహించుకొంటున్న అనూరాధ 7తేది సాయంత్రం చిన్నబజారులో నగల దుకాణానికి వెళ్తున్నట్లు ఇంట్లో నుంచి బయలు దేరింది. చెప్పినట్లే చిన్నబజారుకు వెళ్లింది. ఆమె మెడలో ఐదుసవర్ల బంగారు సరుడు, ఐదువేల రూపాయలు వున్నట్లు ఆమె భర్త నాల్గవ పట్టణ పోలీసులకు ఫిర్యాదు చేశాడు.

అనురాధ శవమై కనిపించిన ప్రాంతంలో బీరు బాటిళ్లు, బిర్యాని పొట్లాల కవర్లు, మూడ్స్ కండోమ్స్ ప్యాకెట్లు వంటివి పడి వుండడం ఈ వ్యవహారమై గందరగోళం నెలకొనింది. ఇంత సంచలనం సృష్టించిన ఈ కేసును శవం లభించిన ప్రాంతం ఆధారంగా రూరల్ పోలీస్‌స్టేషన్ పోలీసులు విచారించాలని ఫోర్త్ టౌన్ పోలీసులంటుంటే కాదు ఫిర్యాదు అందినవారే ఆ పని చేయాలంటూ రూరల్ పోలీసులు చెబుతున్నారు. చిన్న బజారుకు వచ్చి షాపింగ్ చేసిన అనూరాధ కల్లూరుపల్లిలో శవమై కన్పించిన వ్యవహారంలో దాగిన మిస్టరీని పోలీసులు ఛేదించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

## థర్మల్ ప్రాజెక్టులతో ఇబ్బందులే!

జిల్లాలో ఏర్పాటు చేస్తున్న థర్మల్ విద్యుత్ కేంద్రాలకు వ్యతిరేకంగా పోరాడాలని 9తేది నెల్లూరు ఐఎంఏ హాలులో జరిగిన థర్మల్ విద్యుత్ వ్యతిరేక పోరాట కమిటీ సమావేశంలో తీర్మానం చేశారు. ఈ సందర్భంగా ఏర్పాటుచేసిన వర్క్‌షాపులో శాస్త్రవేత్త సాగర్ దారా మాట్లాడుతూ థర్మల్ ప్రాజెక్టుల వల్ల జిల్లాను వాయుకాలుష్యం చుట్టేయబోతుందని, దీనివల్ల చిన్న పిల్లలు, వృద్ధులకు వీలైనంత త్వరగా ఊపిరితిత్తులు దెబ్బతిని క్యాన్సర్‌కు లోనయ్యే అవకాశం వుందన్నారు. థర్మల్ విద్యుత్ కేంద్రానికి కనీసం మూడు కిలోమీటర్ల సమీపంలో ఎవరూ జీవనం సాగించలేరు. పంట భూములు నాశనమై, పండిన పంటలు నాశనమవుతాయన్నారు. మరో శాస్త్రవేత్త బాబురావు మాట్లాడుతూ ఒక ప్రాజెక్టు ప్రక్కన మరో ప్రాజెక్టు పెట్టడమే పెద్ద తప్పన్నారు. ఈ వర్క్‌షాపులో తెలుగుదేశంపార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ, బిజెపి జిల్లా అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి, సిపిఎం నేత చంద్రరాజగోపాల్, మాజీ డిప్యూటీ మేయర్ మాదాల వెంకటేశ్వర్లు, లోక్‌సత్తా శ్రీధర్, డాక్టర్ జెడ్.శివప్రసాద్, డాక్టర్ రమణయ్య పలు ప్రజా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు, మేథావులు పాల్గొన్నారు.




వర్క్‌షాప్‌లో మాట్లాడుతున్న పర్యావరణ శాస్త్రవేత్త సాగర్‌దారా.

• **మంచినీటి**

## పన్ను పెంపుకు రంగం సిద్ధం!

### హేతుబద్ధం కాని విధానం అమలు చేస్తున్నారు.

నెల్లూరు కార్పొరేషన్‌లో నీటిపన్ను పెంచడానికి రంగం సిద్ధం చేసినట్లు విశ్వసనీయవర్గాల ద్వారా తెలిసింది. వాస్తవానికి నీటిపన్నును నీటిసరఫరా చేస్తున్న సంస్థ సంవత్సరానికి అయ్యే ఖర్చును నీటి నియోగదారులతో భాగించి పన్ను నిర్ణయించాలి. కాని అలా కాక ఇష్టమొచ్చినట్లు పెంచబోతున్నారు. నగర పరిధిలో మొత్తం మీద 80వేల గృహాలున్నాయి. వీటిలో కొళాయిన్న ఇళ్లు 40 వేలుంటే కార్పొరేషన్ రికార్డుల్లో మాత్రం 25వేల ఇళ్లు మాత్రమే కొళాయి పన్ను చెల్లిస్తాయి. అంటే దరిదాపులు 15వేల మంది దొంగ కనెక్షన్లతో దర్జాగా కార్పొరేషన్ నీటిని వాడుకొంటున్నారన్న మాట. వన్ టౌన్‌లోని ఖుద్దూస్ నగర్, మన్సూర్ నగర్‌లతోపాటు ఎన్టీఆర్ నగర్, కేశవులు నగర్, అంబేద్కర్ నగర్ తదితర ప్రాంతాల్లో పన్నులు చెల్లించని దొంగ కొళాయి కనెక్షన్లు ఎక్కువగా వున్నాయి. కాని ఈ కొళాయిలను ప్రజలు ప్రత్యేకంగా వేసుకోలేదు. రాజకీయ నేతలు, వాటర్ వర్క్స్ సిబ్బంది కలసి చేసిన కుంభకోణంగా దీన్ని పేర్కొనవచ్చు. పన్ను బాగానే వసూలు చేస్తున్న కార్పొరేషన్ అన్ని ప్రాంతాలకు సక్రమంగా నీటి సరఫరా చేయడం లేదు. బాలాజీ నగర్, హరనాధపురం ప్రాంతాల్లో 20 నిమిషాలు మాత్రమే కొళాయిల్లో నీళ్లు వస్తాయి. దర్గామిట్ట, పొదలకూరురోడ్డు ప్రాంతాల్లోనూ ఇదే తీరులో నీళ్లు వస్తాయి. సంతపేట, పెద్దబజారు, కోటమిట్ట, స్టోన్‌హౌస్‌పేటల్లో మాత్రమే గంటకుపైగా నీళ్లు వస్తాయి. ఒక మనిషికి తలసరి లెక్కన రోజుకు 100 లీటర్ల నీరు కార్పొరేషన్ ఇవ్వాలి. కాని ఇవ్వడం లేదు. ఇచ్చే నీరు సురక్షిత నీరు కావాలి. కాని ఇవ్వడం లేదు. నీటి పంపిణీ విభాగంలో ఫిల్టర్ బెడ్స్ చెడిపోయాయి. క్లోరినేషన్ లేదు. మురికి నీటిని కొళాయిల్లో సరఫరా చేస్తూ పన్ను పెంపుకు ఆలోచన చేస్తున్న కార్పొరేషన్ అధికారగణాన్ని ప్రజలు నిలదీయాల్సిన అవసరం ఎంతైనా వుంది.




అక్రమ మార్గాన వాటర్ వర్క్స్ విభాగం.

రాహుల్‌గాంధీ పేదలకిస్తున్న వరాలు

# ఉద్యోగం, ఆహారానికి హామీ; విద్య, వైద్యం ఉచితం!



దేశ ఆర్థిక విధానాలను విప్లవాత్మక మార్గం వైపు మళ్లించడానికి రాహుల్‌గాంధీ చేస్తున్న ప్రయత్నాన్ని గతవారం ప్రస్తావించుకొన్నాము. 1990 దశకం నుంచి మన్మోహన్‌సింగ్ అమలు చేస్తున్న ఆర్థిక సంస్కరణలు ప్రజలకు నిజమైన అభివృద్ధిని అందించలేక పోతున్నాయన్నది రాహుల్‌గాంధీ భావన. అభివృద్ధికి మన్మోహన్‌సింగ్ చెప్తున్న కొలమానాలు వేరు; రాహుల్‌గాంధీ వెలుగులోకి తెస్తున్న కొలబద్దలు వేరు. ఆర్థిక సంస్కరణల వల్ల దేశంలో అపారంగా సంపద సృష్టి జరిగిందన్నది ప్రధాని వాదన. కానీ ఆ సంపద సమస్తం కొద్ది మంది పారిశ్రామికుల చేతుల్లో చిక్కుక పోతున్నదని, కోట్లాది నిరుపేదల జీవితాలలో మాత్రం ఎటువంటి మార్పు వుండడం లేదని రాహుల్‌గాంధీ వాదన. ఆర్థిక సంస్కరణల వల్ల నిజంగా అభివృద్ధి జరుగుతున్నమాట నిజమైతే, అడవులలో బ్రతికే గిరిజనులు, గ్రామాలలో బ్రతికే దళితులు రెండు పూటలా తిండికి కూడా నోచుకోని పరిస్థితిలో ఎందుకు వున్నారని సూటిగా ప్రశ్నిస్తున్నాడు రాహుల్‌గాంధీ. అందుకు ఆయన చాలా ఉదాహరణలు చూపుతున్నాడు కూడా. బాలింతల మరణాలు, శిశుమరణాలు, గ్రామీణ నిరక్షరాస్యత, పసిపిల్లలలో పోషకాహార లోపం, వైద్య సదుపాయం అందక లక్షలాది గ్రామాలలో కోట్లాది మంది నిర్భాగ్యుల దురవస్థ వంటి అంశాలను పరిగణనకు తీసుకొంటే, ఆర్థిక అభివృద్ధి ఫలాలు పేదలకు ఎంతమాత్రం అందడం లేదన్న మాట నిజమని చాలా గట్టిగా వాదనకు దిగుతున్నాడు రాహుల్‌గాంధీ. ఈ అంశాలపై ప్రధానికి శరపరంపరగా లేఖాస్త్రాలు సంధిస్తున్నాడాయన.

## దేశమంటే మట్టికాదు, మనుషులు!

చట్టాలు చేయడం ప్రభుత్వ బాధ్యత, అదొక నిరంతర ప్రక్రియ. బ్రిటీష్ కాలం నుంచి ఇప్పటివరకు మన దేశంలో కేంద్ర ప్రభుత్వ స్థాయిలో చేసిన చట్టాల సంఖ్య 70 వేల వరకు వుంటుందని ఒక అంచనా. పరిపాలనకు అవసరమైనప్పుడల్లా ఆయా అంశాల మీద చట్టాలు చేయడం ప్రభుత్వ నిర్వహణలో ఒక భాగం. అయితే ఆ చట్టాలేమిటో ప్రజలకు తెలియవు. వాటి వల్ల కలిగే ప్రయోజనం అతి కొద్ది అరుదైన సందర్భాలలో తప్ప ప్రజలకు చేరువ కాదు. కానీ రాహుల్ గాంధీ ప్రతిపాదిస్తున్న, ఆమోదం సాధించిన చట్టాలు ప్రజల జీవితాలలో పెనుమార్పులు తెచ్చేవి కావడం గమనించవలసిన అంశం. అందువల్లనే వీటిపై మేధావివర్గాలలో తీవ్రస్థాయి చర్చలు నడుస్తున్నాయి. దేశమంటే మట్టి కాదు, ప్రజలన్నది ఈ చట్టాలకు ప్రాతిపదిక. దేశ సంపదలో ప్రజలకు హక్కు వుందన్నది సిద్ధాంతం. అది అందరికీ చెందాలన్నది ఆదర్శం.

భారత రాజకీయాలలో ఒక నూతనతరానికి ప్రతినిధి రాహుల్‌గాంధీ. రాజీవ్‌గాంధీ తనయుడిగా, ఇందిరమ్మ మనుమడిగా వారసత్వ అధికారంతో ప్రధాన మంత్రిత్వం దక్కించుకోవడం ఆయనకు మంచినీళ్లు త్రాగినంత సులభం. కానీ ఆ ముద్రతో గద్దె ఎక్కడం ఆయనకు ఇష్టం లేదు. రాజకీయాలలోకి రావాలన్న సంకల్పం కల్గిన సమయంలో ఆయనకు తారసపడిన వ్యక్తులు, సంస్థలు ఆయనలో తీవ్రమైన భావ సంఘర్షణ సృష్టించడమే అందుకు కారణం. భారతదేశంలో అరవై సంవత్సరాల రాజకీయం కోట్లాది మంది నిరుపేద ప్రజలకు చేసిన మేలు చాలా పరిమితమన్న నిజాన్ని బాగా అవగతమయ్యేట్లు చేశారు వారు. ఆ ప్రభావం ఆయన ఆలోచనా ధోరణిని సమూలంగా మార్చివేసింది.

## నిరాడంబరత్వం

మొదట నుంచి కూడా రాహుల్‌గాంధీ నిరాడంబర జీవితానికి అలవాటుపడిన వాడే. హార్వర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలలో డెవలప్‌మెంట్ స్టడీస్ మీద ఎంఫిల్ వరకు చదువుకొన్న రాహుల్‌గాంధీ, లండన్ నగరంలోని మానిటర్ గ్రూప్ అనే మేనేజ్‌మెంట్ కన్సల్టింగ్ కంపెనీలో ఉద్యోగం చేశాడు. మూడేళ్లపాటు ఆయన అక్కడ పని చేస్తే, రోజూ పక్కనే కూర్చునే మిగతా ఉద్యోగులకు కూడా ఆయన రాజీవ్‌గాంధీ కుమారుడని గుర్తించలేక పోయారట. అంత నిరాడంబర జీవితానికి అలవాటుపడినవాడు రాహుల్‌గాంధీ. రాజకీయాలలోకి వచ్చిన తర్వాత కూడా అదే నేపథ్యాన్ని కొనసాగిస్తున్నాడు. 2004లో అమేధి నుంచి ఎమ్పీగా గెలిచిన రాహుల్, ఆ వెంటనే కేంద్ర మంత్రిత్వం కోసం ప్రాకులాడలేదు. కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీ పడలేదు. తనకు అభ్యుదయ భావకుడైన యువజన నాయకుడిగా గుర్తింపు రావాలన్న పట్టుదలతో కృషి మొదలు పెట్టాడు. యూత్ కాంగ్రెస్, ఎన్‌ఎస్‌యుఐ విభాగాలను తన పర్యవేక్షణలోకి తీసుకొన్నాడు. ఆయన చేసిన మొట్టమొదటి పని – జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయానికి వెళ్లి, అక్కడి విద్యార్థులతో ముఖాముఖి మాట్లాడడం. వామపక్ష భావాలకు పెట్టింది పేరైన ఆ విశ్వవిద్యాలయం విద్యార్థులు రాహుల్‌గాంధీని నిర్మొగమాటంగా ప్రశ్నించారు. ఆ ప్రశ్నలతో ఆయనలో ఆలోచనలు కొత్త పుంతలు తొక్కాయి. వాటికి సమాధానాలు వెతుకుతూ దేశ వ్యాప్త పర్యటనలు జరిపాడు.

## నిజమైన భారతాన్వేషణ

ఒరిస్సా, ఉత్తరప్రదేశ్, చత్తీస్‌ఘడ్ తదితర రాష్ట్రాలలోని నిరుపేద ప్రాంతాలను ఒకటికి నాలుగైదుసార్లు సందర్శించాడు. అక్కడి ప్రజలతో సంభాషణలు జరిపాడు. వారి ఇళ్లలో అన్నం తిని, అక్కడే రాత్రి నిద్రలు చేశాడు. ఆ క్రమంలో ఆయనకు నిజమైన భారత దేశం, అసలు సిసలు భారతీయ ప్రజలెవరో అర్థమైంది. తాను రాజకీయాలలోకి రావాలన్న నిర్ణయానికి సార్థకత కలగాలంటే, ఆ అసలు సిసలు భారతీయుల జీవితాలలో మెరుగుదల సాధించాలన్న పట్టుదల పెరిగింది. ఒక దశలో రాహుల్ గాంధీ చత్తీస్‌ఘడ్ అడవులలోకి వెళ్లి కొందరు నక్సల్ నేతలతో కూడా సుదీర్ఘ సంభాషణ జరిపాడు.

## రాజు ప్రభావం

మన నెల్లూరు కలెక్టర్‌గా పని చేసిన కొప్పుల రాజు రాహుల్‌ను నక్సల్ నేతలతో సమావేశ పరచినట్లు చెప్తారు. రాహుల్‌గాంధీకి రాజు గారంటే ఎక్కడలేని అభిమానం. తిరుగులేని గురి. అందువల్లనే మన్మోహన్‌సింగ్ ఆర్థిక సంస్కరణలకు ప్రత్యామ్నాయంగా తాను తలపెట్టిన అభివృద్ధిపై అధ్యయనం కోసం తన తల్లి సోనియాగాంధీ అధ్యక్షతన రాహుల్‌గాంధీ నెలకొల్పిన నేషనల్ అడ్వయిజరీ కౌన్సిల్‌కు రాజును కార్యదర్శిగా నియమించాడు.

రాజు, పేరుకే ఐఎఎస్ అధికారి. ఆయనలో జీతానికి పనిచేసే అధికారి కంటే, జీవితం కోసం తపించే సామాజిక శాస్త్రవేత్త దర్శనమిస్తాడు. నెల్లూరుజిల్లా కలెక్టర్‌గా రాజు శ్రీకారం చుట్టిన మద్యపాన నిషేధ ఉద్యమం, రాష్ట్ర రాజకీయ చరిత్రనే మార్చివేసిన నిజం అందరికీ తెలుసు. అక్షరాస్యతా ఉద్యమం, పొదుపులక్ష్మి ఉద్యమం ఆయన చలవ వల్లనే దేశవ్యాప్తంగా విస్తరించాయి. అయనలోని ఈ సామాజిక అవగాహనను, తపనను, తపస్సు వంటి కృషిని రాహుల్‌గాంధీ చాలా చక్కగా సద్వినియోగం చేసుకొంటున్నాడు.

ఈ నేపథ్యం వల్లనే రాహుల్‌గాంధీ ఇప్పుడు ప్రధాని ఆర్థిక సంస్కరణల మీద ప్రత్యక్ష యుద్ధానికి దిగుతున్నాడు. వారిద్దరి మధ్య నడిచిన వాదోపవాదాలు, లేఖాస్త్రాలు, నివేదికల జగడం నుంచి ప్రభవించిన ప్రజోపయోగ చట్టాలు – రైట్ టు ఇన్ఫర్మేషన్, రైట్ టు ఎడ్యుకేషన్, రైట్ టు ఎంప్లాయిమెంట్ (ఎన్‌ఆర్‌ఇజిపి పథకం) తదితరాలు. ఇవికాక, రైట్ టు హెల్త్, రైట్ టు ఫుడ్, మైనింగ్ నియంత్రణ, భూసేకరణ తదితర చట్టాలను పార్లమెంట్ ముందు పెట్టాలని రాహుల్‌గాంధీ పట్టుబడుతున్నాడు. వాటిలో రైట్ టు ఫుడ్, మైనింగ్ నియంత్రణ చట్టాల పట్ల ప్రధాని తీవ్ర అభ్యంతరం చెప్తున్నాడు. అవి ఆచరణ సాధ్యం కాదని, ఆచట్టాలు చేస్తే విదేశీ పెట్టుబడులు రాకుండా నిలిచిపోతాయని ప్రతిఘటిస్తున్నాడు ప్రధాని. కానీ రాహుల్ గాంధీ ఒప్పుకోవడం లేదు. విదేశీ పెట్టుబడుల కోసం స్వదేశీ పేదల బ్రతుకులతో చెలగాటాలాడడం ఎంత వరకు సమంజసమన్నది రాహుల్ వాదన.

దేశంలోని ప్రజలందరికీ ఆహారం, ఆరోగ్యం, చదువు, ఉపాధి అందించే బాధ్యతను ప్రభుత్వమే తీసుకోవాలన్నది రాహుల్ ప్రతిపాదిస్తున్న సిద్ధాంతం. ఈ నాలుగు అంశాలు ప్రజలు తమ హక్కుగా భావించి ప్రభుత్వాన్ని నిలదీసి సాధించుకొనేట్లు చేయాలన్నది దాని సారాంశం. అందువల్లనే ఈ

కొరవ 15వ పేజీలో



నెల్లూరు విఆర్ కాలేజీలో 1979-81 సంవత్సరాల్లో బయాలజీ ఇంగ్లీషు మీడియం గ్రూప్ చదివిన విద్యార్థులు 30ఏళ్ల తర్వాత సమావేశమై తమ గురువు బుల్లారెడ్డిని సన్మానించిన దృశ్యం. చిత్రంలో కాలేజీ ప్రిన్సిపల్ రాధిక, లెక్చరర్లు భవానీప్రసాద్, రాఘవరెడ్డి తదితరులున్నారు.

# కావలిలో పంజా విసిరిన డెంగీ జ్వరం!

## వందల సంఖ్యలో జ్వరబాధితులు

కావలి పట్టణంలో డెంగ్యూ వ్యాధి విజృంభిస్తోంది. అధిక సంఖ్యలో పట్టణ ప్రజలు ఈ వ్యాధి బారిన పడి ప్రాణాలు కోల్పోతుండగా మరికొందరు ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. మునిసిపల్ కార్యాలయం వెనుక వీధిలో నివసించే ఒక కుటుంబంలో తల్లీ కూతుళ్లకు డెంగ్యూ వ్యాధి సోకగా, వారిని మెరుగైన చికిత్స కోసం నెల్లూరులోని రామచంద్రారెడ్డి ఆస్పత్రికి తరలించారు. వ్యాధి తీవ్రం కావడంతో 13 సంవత్సరాల వయసు గల మంజుల మృతి చెందింది. కావలి నరేంద్ర భారతి పాఠశాలలో చదివే ఈ బాలికకు తీవ్రమైన జ్వరం రావడం, ప్లేట్‌లెట్స్ తగ్గిపోవడంతో ప్రమాదకర స్థితికి చేరుకొని ప్రాణాలు విడిచింది. పలువురు పాఠశాల విద్యార్థులు, ఉపాధ్యాయులు బాలిక మృతదేహాన్ని సందర్శించి నివాళ్లు అర్పించారు. పట్టణంలో దోమల బెడద, పందుల సంచారం అధికం కావడం, చెత్తచెదారాలు పేరుకుపోవడం, మురుగునీరు పొంగి ప్రవహిస్తుండడంతో విషజ్వరాలు ప్రబలుతున్నాయి. రోజురోజుకు డెంగ్యూ తదితర వ్యాధుల బారిన పడేవారి సంఖ్య అధికం అవుతున్నా అధికారులు, మునిసిపల్ సిబ్బంది, ప్రజాప్రతినిధులు పట్టించుకోకపోవడంతో ప్రజలు రోగాలతో అల్లాడిపోతున్నారు.



నెల్లూరు భక్తవత్సలనగర్‌లోని కెఎన్ఆర్ హైస్కూల్‌లో జరిగిన వెంకన శతకం పుస్తకావిష్కరణ సభలో గుండాల నరేంద్రబాబు, మోపూరు పెంచలనరసింహం, ఎం.ఆర్.ప్రసాద్, ఆలూరి శిరోమణిశర్మ, దోనిపర్తి రమణయ్య, బివి.నరసింహం.

# విఆర్వోలపై ఆగ్రహించిన ఆర్డీఓ!

## గూడూరు డివిజన్‌లో పనిచేయని విఆర్వోలు

గూడూరు డివిజన్‌లోని విఆర్‌ఓల పనితీరుపై ఆర్‌డిఓ రామ్మూర్తి తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. బాలాయపల్లి తహశీల్దార్ కార్యాలయంలో జరిగిన మండల దర్శిని కార్యక్రమానికి వచ్చిన ఆర్‌డిఓ ఆయా గ్రామాల్లో ప్రజా సమస్యల పరిష్కారంలో నిర్లక్ష్యం చూపుతున్న విఆర్‌ఓలపై ఆగ్రహించాడు. అవినీతిపై చూపుతున్న శ్రద్ధ పని చేయడంలో చూపడంలేదని చీవాట్లు పెట్టారు. బాలాయపల్లి విఆర్‌ఓనుద్దేశించి మాట్లాడుతూ ఒకే స్థలానికి ఇద్దరు వ్యక్తులకు ఎలా పట్టాలిస్తారని ప్రశ్నించారు. పనితీరు మార్చుకోవాలని లేకపోతే ఇబ్బందులు తప్పవని హెచ్చరించారు. ఈ కార్యక్రమంలో తహశీల్దార్ చెంచుకృష్ణయ్య, ఎంపిడిఓ విజయకుమార్, ఎంపిపి సౌజన్యమ్మ, నరసింహులు, మధుసూధన్ రెడ్డి పాల్గొన్నారు.

● ఇందుకూరుపేటలో

# కిడ్నాప్ గ్యాంగ్!

ఇందుకూరుపేట మండలంలో మహిళలు కిడ్నాప్‌కు గురికావడం సంచలనం రేపింది. మండల పరిధిలోని నరసాపురంకు చెందిన వివాహితను ఇటీవల కొందరు వ్యక్తులు కిడ్నాప్ చేసి పూణెలోని ఒక లాడ్జిలో నిర్భంధించడంతో మండల ప్రజలు అదిరిపడ్డారు. ఈ ఘటన జరిగిన కొద్దిరోజులకే

## ఒకే మాసంలో ఇద్దరు మహిళలు మాయం.

జగదేవిపేటకు చెందిన మరో అమ్మాయిని గుర్తు తెలియని వ్యక్తులు కిడ్నాప్ చేయడంతో ప్రజల్లో భయాందోళనలు వ్యక్తం అవుతున్నాయి. ఇరువురు మహిళలు కిడ్నాప్‌నకు గురైనప్పటికీ పోలీసులు తగినచర్యలు చేపట్టకుండా నిర్లక్ష్యంగా వ్యవహరించడం పట్ల ప్రజలు తీవ్ర నిరసన వ్యక్తం చేస్తున్నారు.

# తీరంలో అధ్వాన్నంగా రోడ్లు!

## వేసి పుష్కర కాలమయ్యింది.

బోగోలు మండలంలోని తీర ప్రాంతాల్లో రోడ్లు అధ్వాన్నంగా తయారై వున్నాయి. ఈ రోడ్లకు దశాబ్దాల తరబడి మరమ్మత్తులు చేపట్టకపోవడంతో గుంటలు పడి నరకాన్ని తలపిస్తున్నాయి. ఈ మార్గాన ప్రయాణించే వాహన చోదకులు తీవ్ర ఇబ్బందులు పడడడంతోపాటు తరచూ ప్రమాదాలకు గురౌతున్నారు. తీరంలోని కడపాళెం, పాతకడపాళెం, జువ్వలదిన్నె పంచాయితీలోని టెంకాయచెట్లపాళెం, తాటిచెట్లపాళెం తదితర గ్రామాల్లో అంతర్గత రోడ్లతోపాటు ప్రధాన రహదారులు ధ్వంసమై పోవడంతో ఈ ప్రాంతంలో బస్సులు తిరగడం లేదు. నెల్లూరుకు రాకపోకలు సాగించాలంటే మత్స్యకారులకు ఆటోలపైనే ఆధారపడాల్సిన దుస్థితి ఏర్పడింది. తీర ప్రాంతం నుంచి సముద్ర ఉత్పత్తులను ఇతర ప్రాంతాలకు చేరవేయడానికి అష్ట కష్టాలు పడాల్సి వస్తోంది.

# వెంకటగిరి సమస్యలు పరిష్కరిస్తా!

వెంకటగిరి మునిసిపాల్టీ పాలకవర్గ పదవీకాలం అక్టోబర్ 3వ తేదీతో ముగిసింది. ప్రత్యేక అధికారిగా గూడూరు ఆర్‌డిఓ రామ్మూర్తి బాధ్యతలు చేపట్టారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ వీలైనంత వరకు మునిసిపాలిటీ అభివృద్ధికి, ప్రజాసమస్యల పరిష్కారానికి తగిన కృషి చేస్తానన్నారు. మన్నవరంలో భెల్ పరిశ్రమ ఏర్పాటు కావడంతో సమీపంలో గల వెంకటగిరి పట్టణా

## మునిసిపల్ ప్రత్యేకాధికారి భరోసా

నికి మంచి భవిష్యత్తు వుందన్నారు. ప్రజలతో మమేకమైతేనే వారు ఎదుర్కొంటున్న సమస్యలు తెలుస్తాయని, అందుకోసం వార్డుల్లో పర్యటిస్తామన్నారు. తన పరిధిలో లేని వాటి పరిష్కారం కోసం కలెక్టర్ దృష్టికి తీసుకొనిపోతానని తెలిపారు. ప్రధానంగా ఇందిరమ్మ స్థలాలు, రేషన్‌కార్డులు, త్రాగునీరు, పారిశుధ్యం, వీధి దీపాలు తదితర అంశాలపై దృష్టి సారిస్తామన్నారు.

● బీరంగుంట

# దాహార్తి తీర్చిన బీద!

## స్వంత నిధులతో ట్యాంకర్ ఏర్పాటు

చాలాకాలంగా అల్లూరు మండలం బీరంగుంట ప్రజలు ఎదుర్కొంటున్న మంచినీటి సమస్య ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు దాతృత్వంతో తీరనుంది. గ్రామస్తుల దాహార్తిని తీర్చేందుకు రెండేళ్ల క్రితం ఓవర్ హెడ్ ట్యాంకును నిర్మించారు. పైపులైన్లు ఏర్పాటు చేసినప్పటికీ నీటి సరఫరాకు ఆటంకం ఏర్పడింది. తిరిగి నీటి సరఫరా సక్రమంగా జరిగేలా చూడాల్సిన ఆర్‌డబ్ల్యుఎస్ అధికారులు చర్యలు చేపట్టకపోవడంతో గ్రామస్తులకు మంచినీటి ఇబ్బందులు ఎదురయ్యాయి. మంచినీటి సమస్యను పరిష్కరించాలని పలుమార్లు అధికారుల చుట్టు తిరిగిన గ్రామస్తులకు నిరాశ ఎదురయ్యింది. గ్రామంలో ఏర్పాటుచేసిన ఓవర్‌హెడ్ ట్యాంకు అలంకార ప్రాయంగా మారింది. ఈ పరిస్థితులలో ప్రజల సమస్యను తెలుసుకొన్న స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు తక్షణం స్పందించి మంచినీటి ట్యాంకర్‌ను సొంత నిధులతో ఏర్పాటు చేయడమేకాక రోజూ మూడు ట్రిప్పులు తిరిగేలా చేయడంతో గ్రామస్తులు హర్షం వ్యక్తం చేస్తున్నారు.



# రెవిన్యూ ప్రజాసేవా కేంద్రం!

## ఒక్కరోజులోనే సర్టిఫికేట్లు

ప్రజాసేవా కేంద్రాలతో రెవెన్యూ లావాదేవీలు సులువైనాయని ఇందుకూరుపేట తహశీల్దార్ రామకృష్ణ తెలియజేశారు. తహశీల్దార్ కార్యాలయంలో ప్రజాసేవా కేంద్రాన్ని ప్రారంభించి మాట్లాడుతూ కేవలం పదిరూపాయలు చలానా కట్టినట్లయితే ప్రజలకు అవసరమైన అడంగల్ కాపీలు, మ్యాపులు ఇతర సమాచారాన్ని ఒక రోజు వ్యవధిలో పొందవచ్చన్నారు. కంప్యూటరీకరణ ద్వారా అతిత్వరగా ప్రజల అవసరాలు, సమస్యలు పరిష్కరించేందుకు వీలు కల్గుతున్నదన్నారు. ఈ కేంద్రం ప్రారంభోత్సవంలో ఎంపిపి కాసా రాధమ్మ, ఎంపిడిఓ చిరంజీవి, రెవెన్యూ ఆఫీసర్ ప్రసాద్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## కోట్ల రూపాయలతో అభివృద్ధి పనులు

వెంకటగిరి పట్టణాన్ని ఈ ఐదేళ్ల కాలంలో కోట్లరూపాయల నిధులు వెచ్చించి ఎంతో అభివృద్ధి చేసినట్లు మునిసిపల్ మాజీ ఛైర్మన్ అల్లం చంద్రమోహన్ చెప్పారు. పాలకవర్గం పదవీకాలం ముగిసిన సందర్భంగా జరిగిన సన్మాన కార్యక్రమంలో ఆయన మాట్లాడుతూ కౌన్సిలర్లు, ప్రజల సహకారంతో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడం జరిగిందన్నారు. అనంతరం ఛైర్మన్, కౌన్సిలర్లు, కోఆప్షన్ సభ్యులను ఘనంగా సన్మానించారు.

## శిథిలావస్థలో తుఫాన్ షెల్టర్

ముత్తుకూరు పంచాయితీకి సమీపంలో గల చలివేంద్రం గ్రామంలో ఏర్పాటు చేసిన తుఫాన్ షెల్టర్ శిథిలావస్థకు చేరుకొంది. తీరప్రాంతానికి చేరువలో వుందన్న కారణంతో కొన్నేళ్ల క్రిందట తుఫాన్ రక్షిత కేంద్రాన్ని నిర్మించారు. అప్పటి నుంచి దీని బాగోగులు పట్టించుకోకపోవడంతో నిరుపయోగంగా మారింది. తుఫాన్ సమయాల్లో తీరప్రాంత ప్రజలను తుఫాన్ షెల్టర్‌కు తీసుకొని వచ్చి రక్షణ కల్పిస్తారు. అంతటి ప్రాధాన్యత గల ఈ షెల్టర్ గురించి మండల అధికారులు పట్టించుకోకపోవడంతో అది కాస్త శిథిలామైపోయింది. బిసి, ఎస్సీ, ఎస్టీ కుటుంబాలు అధికంగా వుండే చలివేంద్రం గ్రామం గురించి అటు పాలకులు, ఇటు అధికారులు తగిన శ్రద్ధ పెట్టడం లేదని స్థానికులు వాపోతున్నారు. ఇప్పటికైనా అధికారులు స్పందించి తుఫాన్ షెల్టర్‌కు మరమ్మత్తులు చేసి ఉపయోగంలోకి తీసుకరావాలని వారు కోరుకొంటున్నారు.

## మహిళలకు శిక్షణ

ముత్తుకూరు మండలంలోని మహిళలకు టైలరింగ్‌లో శిక్షణా కార్యక్రమం రిలయన్స్ కాలనీ కమ్యూనిటీహాలులో జరిగింది. స్వర్ణభారత్ గ్రామీణాభివృద్ధి సంస్థ, (సరైడ్) ఆధ్వర్యంలో జరుగుతున్న ఈ శిక్షణా కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన రిలయన్స్ సంస్థ మేనేజర్ బాబయ్య మాట్లాడుతూ స్వయం ఉపాధి ద్వారానే మహిళలు గుర్తింపు పొందుతారని అన్నారు. స్వర్ణ భారత్ ట్రస్టు డైరెక్టర్ వెంకటేశ్వర్లు మాట్లాడుతూ మహిళలకు సంస్థ తరపున 18 కోర్సుల్లో శిక్షణనిస్తున్నట్లు చెప్పారు.

## గ్రామాలు కళకళ

ప్రభుత్వం ప్రవేశపెట్టిన మహాత్మాగాంధీ వనసంరక్షణ పథకం ద్వారా గ్రామాలు కళకళలాడనున్నాయని జిల్లా నీటియాజమాన్య సంస్థ (డ్వామా) ఎపిడి సతీష్‌బాబు వ్యాఖ్యానించారు. ఇందుకూరుపేట మండలం గంగపట్నంలో నర్సరీ కేంద్రాన్ని ఏర్పాటుచేసిన సందర్భంగా ఆయన మాట్లాడుతూ అటవీశాఖ పర్యవేక్షణలో మండల పరిషత్ గ్రామసభ ద్వారా అవసరమైన మొక్కలు పెంచుతున్నట్లు తెలిపారు. త్వరలో మరో నాలుగు నర్సరీ కేంద్రాలు ఏర్పాటు చేస్తున్నట్లు చెప్పారు. ఈ కార్యక్రమంలో ఎంపిపి కాసా రాధమ్మ, ఫారెస్టు రేంజర్ సుధాకర్‌రావు, సెక్షన్ ఆఫీసర్ శ్రీనివాసులు, సర్పంచ్ శివకోటయ్య, ఎంపిటిసి సభ్యుడు రమణమ్మ, తహశీల్దార్ రామకృష్ణ, ఎంపిడిఓ చిరంజీవి తదితరులు పాల్గొన్నారు.

## సోమశిల జలాల విడుదల

ఇందుకూరుపేట, తోటపల్లిగూడూరు మండలాలకు జాఫర్‌సాహెబ్ కెనాల్ ద్వారా సోమశిల జలాలు విడుదల చేసేందుకు సాగునీటి సంఘ సమావేశం గ్రీన్ సిగ్నల్ ఇవ్వడంతో రైతుల కష్టాలు తీరనున్నాయి. నీటి విడుదలకుగాను ఈ మండలాల పరిధిలో కాల్వల పూడికతీతను జాఫర్ సాహెబ్ కెనాల్ డిస్ట్రిబ్యూటరీ ఛైర్మన్ సురేంద్రరెడ్డి చేపట్టారు. ప్రొక్లెయిన్లు ఉపయోగించి పూడిక తీయడం, చెట్ల తొలగింపు ముమ్మరంగా జరుగుతున్నది. అక్టోబర్ 21నాటికి ఈ కాల్వకు నీటిని విడుదల చేయనుండడంతో పనులు పూర్తి చేసేందుకు డిస్ట్రిబ్యూటరీ కమిటీ తలమునకలై వుంది.

## ఎపిటిఎఫ్ నూతన కమిటి

వెంకటగిరి నియోజకవర్గంలోని వివిధ మండలాలకు సంబంధించి ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ (ఎపిటిఎఫ్) నూతన కమిటీ ఎన్నికయ్యింది. అక్టోబర్ మొదటి వారంలో జరిగిన సర్వసభ్య సమావేశంలో బాలాయపల్లి, డక్కిలి మండలాలకు నూతనంగా అధ్యక్ష కార్యదర్శులుగా సత్యనారాయణ, దుర్గాప్రసాద్, అసోసియేట్ అధ్యక్షులుగా రవీంద్ర, మహిళా కన్వీనర్‌గా లీలాకుమారి, కోశాధికారిగా భాస్కర్‌లు ఎన్నికయ్యారు. ఈ సందర్భంగా రాష్ట్రకార్యదర్శి డి.సుధాకర్‌రెడ్డి మాట్లాడుతూ ప్రభుత్వ పాఠశాలలను పరిరక్షించుకోవాల్సిన బాధ్యత ఉపాధ్యాయులపైనే వుందన్నారు.

# రాజీనామా చేసి గెలువు...!

### ప్రసన్నకు సోమిరెడ్డి సవాల్





కోవూరు శాసన సభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తన స్వార్ధ, కుటిల రాజకీయాల కోసం కుమారుడిని బలిపెడ్తున్నాడని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి విమర్శించారు. బుచ్చిరెడ్డిపాళెంలోని ఎస్ఎస్ కళ్యాణ మండపంలో జరిగిన కోవూరు నియోజకవర్గ విస్తృతస్థాయి కార్యకర్తల సమావేశానికి విచ్చేసిన సోమిరెడ్డి ప్రసన్న తీరుపై విరుచుకపడ్డారు. నల్లపురెడ్డి శ్రీనివాసులరెడ్డి వారసునిగా వచ్చిన ప్రసన్న స్వార్ధ రాజకీయాలను నెరపడం సిగ్గు చేటన్నారు. ప్రసన్నకు దమ్ముంటే జగన్ బొమ్మ పెట్టుకొని ఎన్నికలలో కోవూరు నుంచి పోటీ చేసి గెలవాలని సవాల్ విసిరారు. రాష్ట్రప్రభుత్వం అన్ని రంగాలలో వైఫల్యం చెందిందన్నారు. ప్రజలు రోగాలతో సతమతం అవుతున్నా, పాలన స్తంభించినా పట్టించుకొనే వారే లేకుండా పోయారన్నారు. ఇతర ప్రాంతాలలో అడ్డుకొన్న బొగ్గు ఆధారిత పవర్ ప్రాజెక్టులను జిల్లాలో ఏర్పాటుచేస్తూ కాంగ్రెస్ నాయకులు చిల్లర దండుకొంటున్నారని ఆరోపించారు. కాంగ్రెస్ నాయకుల తీరు సిగ్గు చేటన్నారు. సోమిరెడ్డితోపాటు తర్వాత మాట్లాడిన పలువురు నేతలు ప్రసన్నను తిట్టేందుకే అధిక సమయం వెచ్చించడం విశేషం.

### స్వర్గంలో పని వుండి

# శంకరన్‌ను దేముడు పిలిపించాడు!



ఎస్ఆర్.శంకరన్ మరణించాడు. పేద ప్రజల బాగు కోసం జీవితకాలం శ్రమించి, తపించి, తపస్సు చేసిన ఒక మహాత్ముడు మనకు లేకుండాపోయాడు. ప్రభుత్వ ఉద్యోగానికి నిజమైన నిర్వచనం ఇచ్చిన మహానుభావుడాయన. 1957 నుంచి 1992 వరకు 35ఏళ్లపాటు సివిల్ సర్వీసు అధికారిగా ఆయన వేసిన ప్రతి అడుగు, చేసిన ప్రతి పని, తీసుకొన్న ప్రతి చర్య, వేసిన ప్రతి ప్రణాళిక, ఆచరించిన ప్రతి పథకం పేదల సంక్షేమం కోసమే. అది తప్ప ఆయన మనసులో మరొక ఆలోచన వుండేది కాదు. దళితులు, గిరిజనులు అంటే ఆయనకు ప్రాణం. వారికోసం తాను చేయగల్గింది ఇంకేమీ లేదా అని తపన పడేవాడు. ఎంత చేసినా తక్కువే అన్న అసంతృప్తితో మధనపడేవాడు. పేద ప్రజలకు నిజమైన సేవకుడాయన. అందువల్లనే పని చేసిన ప్రతి చోటా ఆయన్ను దేముడిగా పూజించారు. ఏ అంశమైనా సానుకూల దృక్పథంతో చూడడం ఆయన గొప్పదనం. తాను చేపట్టిన ప్రతి బాధ్యతనూ దిగ్విజయంగా నెరవేర్చేవాడు. మానవ హక్కులంటే ఆయనకు ఎనలేని మక్కువ. చేతులతో అశుద్ధాన్ని ఎత్తవలసిన దౌర్భాగ్య జీవనం గడిపే పారిశుధ్య కార్మికుల కోసం దేశవ్యాప్తంగా సఫాయి ఉద్యమాన్ని నిర్మించిన వాడు ఆయనే. ఆయన ఒత్తిడి వల్లనే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేతులతో మరుగుదొడ్ల శుభ్రం చేసే వృత్తిని నిషేధించాయి. వెట్టి చాకిరీ నిర్మూలనకు ఆయన చేసిన కృషి అంతా ఇంతా కాదు. వెట్టి కార్మికుల రక్షణ కోసం పటిష్టమైన చట్టాలను ఎన్నిటినో రూపకల్పన చేశాడు.

ప్రభుత్వోద్యోగిగా శంకరన్ ప్రజా సేవా జీవితం నెల్లూరు జిల్లాలో ప్రారంభం కావడం, ఇక్కడే ఒక రూపు దిద్దుకోవడం మన అదృష్టం. 1961 నుంచి 63 వరకు డిఆర్వోగా నెల్లూరులో పనిచేశారాయన. ఆ తర్వాత 1968 - 69 సంవత్సరంలో కలెక్టర్‌గా పని చేశారు. ఆయన కలెక్టరేట్‌లో వున్నన్ని రోజులూ పేద ప్రజలకు స్వర్ణయుగం అనడం అతిశయోక్తి కాదు. గ్రామాలకు దారి డొంకలులేని రోజులవి. అయినాసరే, ఆయన జిల్లాలోని ప్రతి గ్రామం తిరిగాడు. మైళ్ల దూరం కాలినడకన తిరిగే వాడు. అప్పటికి భూసంస్కరణలు అమలు కాలేదు. ఇందిరమ్మ 20 సూత్రాల ఆర్థిక పథకం కూడా అమలు

కొరవ 14వ పేజీలో

# శాపగ్రస్తుల నోరు కొట్టడం దేముడూ క్షమించని పాపం!



నెల్లూరుజిల్లా ఇంటిగ్రేటెడ్ ట్రైబల్ డెవలప్‌మెంట్ ఏజన్సీ ప్రాజెక్ట్ డైరెక్టర్ కె.రమేష్‌ను మరొక సంవత్సరం పాటు ఇక్కడే కొనసాగించాలని ఆదేశించాడు ముఖ్యమంత్రి. ఒక జిల్లాస్థాయి అధికారి విషయంలో ముఖ్యమంత్రి ప్రత్యేక ఉత్తర్వులు జారీ చేయడం అసాధారణమైన విషయం. అందుకు కారణం, ఆ అధికారికి వున్న అసమాన్యమైన గుణగణాలు కావడం గమనార్హం.

రమేష్ చాలా వివాదాస్పద అధికారి. గిరిజనాభివృద్ధి సంస్థ ఆయన మాతృ సంస్థ కాదు. వ్యవసాయ విశ్వవిద్యాలయంలో చిన్న స్థాయి అగ్రికల్చరల్ ఆఫీసర్ ఆయన. రాజకీయ పలుకుబడితో జిల్లా పదవిలోకి వచ్చాడు. అది ఆయన పాలిట కనకపు సింహాసనమే అయ్యింది. జిల్లా ఉన్నతాధికారులు, కాంగ్రెస్ ఎమ్మెల్యేల వ్యక్తిగత బలహీనతలను కనిపెట్టి, వారి తృప్తి దీరా "సరఫరాలు" చేయడం రమేష్ నేర్చిన విద్య. ఆయన చేసే "మర్యాదలు" ఒకసారి రుచి చూసినవారు, ఇక ఆయన్ను వదలి పెట్టలేరని ప్రతీతి. ఆ విద్యే రమేష్‌కు శ్రీరామరక్ష.

సమాజంలో గిరిజనుల కంటే శాపగ్రస్త జీవులు వేరొకరుండరు. నెల్లూరుజిల్లాలోని యానాదులు, చల్లా యానాదుల జీవితాలను చూస్తే కరకు రాతి గుండెలు కూడా కరిగి నీరౌతాయి. అటువంటి దీనులను వుద్ధరించడానికి స్థాపించిన ఐటిడిఎ వంటి సంస్థను రమేష్ వంటి అధికారుల చేతికి అప్పచెప్పడం ప్రభుత్వం చేసిన నేరం. గిరిజనుల నోరు కొట్టి, వారికి చెందాల్సిన కోట్లాది రూపాయల నిధులను కొల్లగొట్టి ఆయన తమకు చేసే సేవలకు మురిసిపోవడం జిల్లా అధికారులు చేస్తున్న పాపం. ఐటిడిఎలో జరుగుతున్న అక్రమాలు అన్నీ ఇన్నీ కావు. చల్లా యానాదులకు నేరుగా ఇచ్చే అప్పులలో సగం మొత్తాన్ని అధికారులు కమీషన్ క్రింద బొక్కుతున్నారట. నాయుడుపేటలో ఒక ప్రైవేట్ గిరిజన వసతి గృహాన్ని వ్యభిచార గృహంగా మార్చారని పత్రికలలో గబ్బు రేగితే, ప్రభుత్వం స్పందించి,

కొరవ 14వ పేజీలో

# సిరి సంపదలను కల్గించే అనంతపద్మనాభ వ్రతం!



సకల సౌభాగ్యాలను, సకల శుభాలను కల్గించేది అనంత పద్మనాభ వ్రతం. ఈ వ్రతాన్ని భాద్రపద శుక్ల చతుర్దశి రోజున ఆచరిస్తారు. పాల కడలిపై యోగనిద్రలో వున్న శ్రీ మహా విష్ణువుకు చేసే మేలుకొలుపు ఇది. సాక్షాత్తు శ్రీకృష్ణభగవానుడు ధర్మ రాజుకు ఈ వ్రతం చేయమని చెప్పినట్లుగా పురాణాలు చెప్తున్నాయి. మాయాజూదంలో తన సర్వస్వాన్ని పణంగాపెట్టి రాజ్యభ్రష్టుడైన ధర్మ రాజు శ్రీకృష్ణభగవానుడి సలహా ప్రకారం తాను కోల్పోయిన సిరి సంపదలు పునఃప్రాప్తిపొందేందుకు ఈ అనంత పద్మనాభవ్రతం ఆచరించినట్లు తెలుస్తోంది.

అనంతశయన మూర్తి ఆశీస్సులు పొందేందుకు, ఆయన కృపాకటాక్షాలు పొందేందుకు చేసే ఈ వ్రతానికి సంబంధించి ఒక కథనం ప్రచారంలో వుంది. కృత యుగంలో సుశీల, కౌండిల్యలు దంపతులుగా వుంటారు. వారు పుణ్యక్షేత్రాలను దర్శిస్తూ వుండగా, ఒకనాడు సుశీల నదీ తీరాన కొందరు వ్రతాన్ని చేయడాన్ని గమనించి దాని వివరాలు అడుగగా వారు ఎంతో పుణ్యాన్ని, సకల సిరిసంపదలను ప్రసాదించే అనంత పద్మనాభ వ్రతాన్ని గూర్చి వివరిస్తారు. సుశీల ఆ వ్రతాన్ని ఆచరించ దలచి ఇల్లు శుభ్రపరచి, తోరాలు కట్టుకొని నియమనిష్టలతో చేస్తుంది. దాని ఫలితంగా ఇంట్లో సిరిసంపదలు నెలకొంటాయి. ఆ సంపదలతో కన్నుమిన్ను కానరాని కౌండిల్యుడు సుశీల చేతికి కట్టుకొన్న తోరమును తెంపి వేస్తాడు. ఆ పాప ఫలితంగా మొత్తం సంపదలు హరించుకపోయి దరిద్రుడవుతాడు. అప్పుడు నిజాన్ని గ్రహించిన కౌండిల్యుడు తిరిగి విష్ణువును ప్రసన్నం చేసుకొనేందుకు ఆర్తితో చెట్టూ, పుట్టా పట్టుకొని తిరుగుతున్న సమయంలో పలు పరీక్షలు పెట్టిన పద్మనాభస్వామి చివరకు వృద్ధపండిత రూపంలో దర్శనమిచ్చి కరుణించి ఆశీస్సులు అందజేయడంతో కోల్పోయిన సిరిసంపదలను తిరిగి పొందుతాడు.

అనంత పద్మనాభ వ్రతాన్ని ఆచరించదలచిన వారు ఇంటిని శుభ్రపరచి ఈశాన్యం దిక్కున పీట వేసి దానిపై శుభ్రమైన వస్త్రాన్ని పరచి రెండు కలశాలను స్థాపించాలి. పీట వద్ద పసుపు కుంకుమలు, రంగవల్లులతో అలంకరించాలి. అష్టదళ పద్మమును పిండితో వేయాలి. రెండు కలశాలలో ఒకటి స్వామిని ఆవాహన చేసుకోవడానికి, మరొకటి శ్రీ మహాలక్ష్మిని ఉద్దేశించి ఏర్పాటు చేస్తారు. నది జలాలను కలశాలలో నింపి నారికేళాలను వుంచి పుష్పాలతో పూజించాలి. 14 ఎర్రని దారపు పోగులతో, 14 ముడులతో చేసిన తోరమును పురుషులు కుడిచేతికి, స్త్రీలు ఎడమ చేతికి కట్టుకోవాలి. ఇవి నాగదారాలుగాను పిలువబడతాయి. ఈ సందర్భంగా 14 రకాల ఫలాలు, 14 రకాల పిండి వంటకాలతో నైవేద్యం సమర్పించాలి. ఈ వ్రతాన్ని నియమ నిష్టలతో ఆచరించినట్లయితే సకల శుభాలు కల్గుతాయని పురాణ కథనం.




ఆత్మవిశ్వాసం అధికంగా ఉంటుంది. ఊహించిన రీతిలో ధనాదాయం ఉంటుంది. వ్రత నియమాల వైపు మనసు పోనిస్తారు. ప్రయాణాలు లాభిస్తాయి. ఇంటిలో సుఖసంతోషాలు నెలకొంటాయి. స్పెక్యులేషన్ లాభిస్తుంది. ఇతరుల విషయాలలో జోక్యం చేసుకోవద్దు. అనారోగ్య బాధలుండవచ్చు. ఖర్చులు మితిమీరడం బాధాకరంగా ఉంటుంది. ఎదురుచూసిన వ్యక్తుల్ని కలుసుకొంటారు.




ప్రముఖులను కలుసుకొంటారు. పూజాకార్యాలతో మనసు నిర్మలమవుతుంది. నూతన ప్రయత్నాలకు శ్రీకారం చుడతారు. కొత్త అనుభూతులు చోటుచేసుకొంటాయి. సన్నిహితుల, మిత్రుల ద్వారా ప్రియవార్తా శ్రవణం. విశిష్ట వస్త్రాభరణ ప్రాప్తి. బంధు మిత్రుల కారణంగా శుభవ్యయాలుంటాయి. పూజాదులు బృంద కార్యక్రమాలు విజయవంతంగా సాగుతాయి.




శుభకార్యాలకు వెచ్చిస్తారు. మూర్ఖపు పట్టుదల పనికిరాదు. దైవపూజా కార్యక్రమాలలో పాలుపంచుకొంటారు. బంధుమిత్రుల మూలంగా కష్టనష్టాలెక్కువ. భగవదనుగ్రహంకోరి ఆలయాలను దర్శిస్తారు. ఇతరులతో అభిప్రాయ భేదాలు కొంతవరకు తొలగుతాయి. ఆదాయమున్నా ఖర్చులు అధికం. వృత్తి విషయాలు చక్కగా ఉండి సహోద్యోగుల, అధికారుల సహాయ సహకారాలు లభిస్తాయి.




సుఖసంతోషాలకు కొదవుండదు. బంధువుల నడుమ ప్రతిష్ఠ పెరిగే రీతిలో సాహస కృత్యాలు చేస్తారు. జ్యేష్ఠసోదరుల, మిత్రుల సాయమందుతుంది. వృత్తిలో పురోగతి ఉంటుంది. చాలా మంచి రోజు. ముఖ్యులైన మిత్రుల్ని కలుసుకొంటారు. అవసరమైన గృహోపకరణాలు కొంటారు. ధనాదాయం తృప్తినిస్తుంది. దైవపూజాదుల్లో శ్రద్ధ చూపుతారు. మాతృసంబంధీకుల నుండి సాయమందుతుంది.




దానధర్మాది పనుల్లో మనసు పోనిస్తారు. శుభ వినోద కార్యాల్లో భాగం పంచుకొంటారు. వృత్తి విషయాలు చక్కగా ఉండి సహోద్యోగుల, అధికారుల సహాయ సహకారాలు లభిస్తాయి. బంధు మిత్రులను, గురుతుల్యులను కలుసుకొంటారు మరపురాని ముఖ్య సంఘటన చోటు చేసుకొంటుంది. కుటుంబసభ్యుల అవసరాలను పూర్తి చేస్తారు. సోదరులతో సంబంధాలు దెబ్బతింటాయి.




మంచివారితో మైత్రి లభించి మేలు ఫలితాలనందుకొంటారు. భవిష్యదాదాయాలను ఊహించి ఖర్చులు చేస్తారు. అభిప్రాయ భేదాలు తొలగి కళత్ర సంబంధాలు మెరుగుపడతాయి. సదాలోచనలు మంచిది. సోదరులతో సంబంధాలు దెబ్బతింటాయి. నూతన ప్రయత్నాలలోకి దిగుతారు. ముఖ్యులైన మిత్రుల్ని కలుసుకొంటారు. అవసరమైన గృహోపకరణాలు కొంటారు.

# వారఫలాలు

*తేది 16-10-2010 నుండి 22-10-2010 వరకు కన్య, తులల్లో రవి, బుధులు; కన్యలో శని; మీనంలో గురువు; తుల, వృశ్చికాల్లో కుజుడు; తులలో శుక్రుడు; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; మకర, కుంభ, మీనాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

16తేది మహర్నవమి.
17తేది విజయదశమి.
22తేది వాల్మీకి జయంతి.

### శుభ ముహూర్తాలు

17తేది వృశ్చికలగ్నాన ఉ.8.00 నుండి 9.30 వరకు సుముహూర్తాలున్నాయి.

### అక్టోబర్ తిథులు
### ఆశ్వయిజ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 16 | శని | నవమి | సా.5.55 | గం.ల.వ |
| 17 | ఆది | దశమి | రా.8.23 | గం.ల.వ |
| 18 | సోమ | ఏకాదశి | రా.10.57 | గం.ల.వ |
| 19 | మంగళ | ద్వాదశి | రా.1.24 | గం.ల.వ |
| 20 | బుధ | త్రయోదశి | తె.3.37 | గం.ల.వ |
| 21 | గురు | చతుర్దశి | తె.5.30 | గం.ల.వ |
| 22 | శుక్ర | పౌర్ణమి | పూర్తిగా | |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




ఇతరుల విషయాలలో జోక్యం చేసుకోవద్దు. అనారోగ్య బాధలుండవచ్చు. ఖర్చులు మితిమీరడం బాధాకరంగా ఉంటుంది. భగవత్ప్రార్థన మేలు. ఎదురుచూసిన వ్యక్తుల్ని కలుసుకొంటారు. ఆకస్మికంగా ఎదురైన ఖర్చులకోసం అప్పులు చేయవలసి వస్తుంది. వినూత్న అనుభూతులు చోటు చేసుకొంటాయి. వృత్తిలో అధిక శ్రమ ఉంటుంది. నియమ నిష్ఠలపై మనసు పోనిస్తారు.




ఎదురుచూసిన ఫలితాలు చేతికందే కాలం. ఇంటికి సంబంధించిన అత్యవసర వస్తువులు కొనుగోలు చేస్తారు. ధనాదాయం తృప్తికరంగా ఉంటుంది. విదేశీయానావకాశాలు అందివస్తాయి. బంధుమిత్రుల సమాగమం ఆనందాన్ని, మనశ్శాంతినిస్తుంది. బడలిక వదలి ఉత్సాహంతో పనులు పూర్తి చేస్తారు. ప్రభుత్వ సంబంధిత పనులు ఆటంకాలు లేకుండా సాగుతాయి.




వాక్శూరత్వాన్ని వదలి కార్యశూరత్వాన్ని ప్రదర్శించాలి. మరచిపోయి ఆగిన పనుల్ని త్వరగా పూర్తి చేస్తారు. సంతానకారణంగా ఏర్పడిన సమస్యల నుండి బయటపడతారు. పుణ్యకార్యాలలో పాలు పంచుకొంటారు. ప్రతి పనిలో ఏకాగ్రత, నిష్ఠ ప్రదర్శించి విజయం సాధిస్తారు.సమాజంలో గౌరవ మర్యాదలు ఇనుమడిస్తాయి. మాతృ కళత్ర సంబంధీకుల నుండి కోరిన రీతిలో ధనాగమం ఉంటుంది.




శారీరక శ్రమ, హాస్పిటలైజేషన్ ఉండవచ్చు. ధనవిషయంలో కటకట ఉండవచ్చు. ఖర్చులధికం. పనులు నిదానంగా సాగవచ్చు. కళత్రసంబంధాలు చక్కగా వుండవు. అధికంగా ఖర్చు చేసినా తృప్తి ఉండకపోవచ్చు. దూరప్రయాణాలు నిరుపయోగాలు. వైద్య సంబంధిత ఖర్చులు తప్పవు. ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకొని ఇబ్బందులు కొని తెచ్చుకోవద్దు. వివాహ ప్రయత్నాలు చక్కగా ఫలిస్తాయి.




ప్రతిపనిలో నిదానం అవసరం. అప్పుడే మనశ్శాంతి లభిస్తుంది. మీ నిరీక్షణ ఫలించి ఎదురుచూసిన వ్యక్తితో సంభాషణ చేస్తారు. దూరప్రయాణాలు సత్ఫలితాలనిస్తాయి. ఆంత్ర బాధలుండవచ్చు. ధనవిషయంలో లోపముండదు. మీ కార్యనిర్వహణా సామర్థ్యం బహిర్గతమవుతుంది. స్థిరాదాయానికి తగిన పథకాలు ఏర్పరుచుకొంటారు. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు ఫలవంతమవుతాయి.




అన్ని విధాల అభివృద్ధిపథంలో ప్రయాణం చేస్తారు. ఆర్థిక లావాదేవీలు సరియైన రీతిలో నిర్వహించి విజయం సాధిస్తారు. ఆగిపోయిన పనుల్ని మళ్లీ ఉత్సాహంతో పూర్తి చేస్తారు. నూతన వాహనప్రాప్తి లేదా వాహనరిపేర్ల అవకాశాలున్నాయి. వృత్తి అభివృద్ధికి తోడ్పడే వ్యక్తుల్ని కలుసుకొంటారు. ఉద్యోగరీత్యా ఎదురుచూసిన ఆర్థిక లాభాలు చేతికి అందివస్తాయి.

# శత్రుస్థానాల్లో గ్రహాలతో అశుభాలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎమ్.జలంధరరెడ్డి — సంగం*

** గ్రహాలు శత్రుస్థితిలో వుంటే ఫలితాలెలా వుంటాయి?*

శత్రుస్థానాల్లో గ్రహాలు అశుభాల్నిస్తాయి. ఉదాహరణకు చంద్రుడు శత్రుస్థానంలో వుంటే మానసిక వత్తిడులు, వ్యాధులు, కలహాలు, మూత్ర వ్యాధులు సంభవిస్తాయి.

*బి.దామోదర్‌రెడ్డి — సికింద్రాబాద్*

** లిఫ్ట్ ముఖద్వారాన్ని ఫ్లాట్లు చూడవచ్చా?*

ఫ్లాట్ల ప్రక్క 'లిఫ్ట్' ఉండటం కానీ, ఎదురుగా రావడం కానీ, మూలల్లో ఉండటం కానీ కూడదు. ఆర్థిక నష్టమని శాస్త్రం చెబుతోంది.

*టి.పూర్ణానందశాస్త్రి — ఒంగోలు*

** 'ఘాతవేధ' వుందని చెప్పారు. మనసు మనసులో లేదు.*

జైమినీ వాస్తులో ఆగ్నేయ, నైరుతి, వాయువ్యాలలో గోతులుండకూడదని అలా వుంటే మానసిక, శారీరక రోగాలు వస్తాయని చెప్పారు. 'ఘాత' అంటే గొయ్యి లేదా అగాధం.

*జి.రామమూర్తి — నెల్లూరు*

** తావీజు కట్టుకుంటేనే నా రోగం తగ్గుతుంది. మా ఆవిడ మూఢ నమ్మకం అంటుంది.*

మూఢ నమ్మకాల మీద తిరుగుబాటు చేసిన విశ్వామిత్ర మహర్షి కూడా నమ్మకం దివ్యౌషధం అన్నారు. 'గృహవేధ నిరోధ సూత్రావళి'లో మీ పద్ధతిలో మీరుండండి.

*పి.వి.విష్ణురెడ్డి — హైదరాబాద్*

** నిర్మాణంలో కోణాలు పెరిగాయి. ఇంట్లో వాళ్ల భయం వారిది.*

ముందు సమాంతరంగా వుండి వెనుక కోణాకృతులు కలిస్తే 'వాస్తు దుందుబి' మృత్యువు నిర్వివాదాంశం అంటోంది.

*పండిత నిరోష్ — విజయవాడ*

** వాయువ్యంలో సెప్టిక్‌ట్యాంకు వల్ల అగాధమయింది.*

ఉత్తర, పశ్చిమాల మధ్యస్థం భ్రష్టమవుతుంది. అందువల్ల స్త్రీ, పురుష మానసిక, శారీరక, ఆర్థిక సమస్యలుంటాయి.

*డాక్టర్ తిరుపతిశాస్త్రి — బందరు*

** ప్రాచీన వాస్తు శాస్త్రాల్లో ఛాందసాల్ని దరిచేరనివ్వని శాస్త్రాలేవి?*

అన్ని శాస్త్రాలు శాస్త్రీయతనే చెప్పాయి. అయితే నిక్కచ్చితనాన్ని పాటించనివి రుద్రమామిళం, వాస్తుప్రదీపం, ధర్మసింధు, వాస్తు రాజవల్లభం మొదలగునవి.

*ఆర్వేల కాత్యాయని — బెంగుళూరు*

** షోడశ కర్మలంటుంటారు అవేమిటి?*

మానవ జీవితంలో 16 కర్మలవి. గర్భాదాన, సీమంతం నుంచి స్నాతక, పైతృక, వివాహం మొదలైన కర్మల్ని 'షోడశ' అంటారు. 'ధర్మక్రతు' గ్రంథంలో వీటి వివరణలున్నాయి.

*విత్తుల శశిరేఖ — సూళ్లూరుపేట*

** అపార్ట్‌మెంటులో ఫ్లాటు సక్రమంగానే వుంది. బాహ్యప్రవేశంలోనే అవాస్తు దోషాలున్నాయి.*

ఫ్లాట్ల వాస్తు ఒట్టిమాట. బాహ్యదోషాలు కూడా ఫ్లాట్లపై వుంటాయి.

*జె.వి.రాధామనోహర్ — బెంగుళూరు*

** ఫ్లాటు తూర్పువైపున వుంది. కారు పార్కింగ్ ఏ వైపుకు ఉండాలి?*

ఫ్లాటు తూర్పు వైపు వుంటే కారు పార్కింగ్ తూర్పు, ఉత్తరాలవైపు చేయాలి.

*వై.వి.శమంతకరెడ్డి — బెంగుళూరు*

** కర్మఫలాన్ని, దైవ నిర్ణయాన్ని ఎదిరించకూడదనుకున్నాను.*

మానవ ప్రయత్నం చేయమని సప్తమహర్షులు చెప్పారు. ప్రయత్న లోపం వల్ల సమస్యలు మరింత జటిలమైతే వాటిని కర్మఫలను కోవడం మీ మూఢత్వం!

# అసాంఘిక కార్యక్రమాల అడ్డాగా రాజీవ్ గృహకల్ప!

**నెల్లూరు ఇరుగాళమ్మగుడి ప్రాంతంలో నిర్మించిన రాజీవ్‌గృహకల్ప అపార్ట్‌మెంట్‌లలో అసాంఘిక కార్యక్రమాలు జోరుగా జరుగుతున్నాయి. పోలీసు నిఘా కొరవడడంతో ఇక్కడ సాధారణ జీవనం గడిపేవారికి ఇబ్బందులు తప్పడం లేదు.**

నెల్లూరు ఇరుగాళమ్మ గుడి ప్రాంతంలో నిర్మించిన రాజీవ్ గృహకల్ప భవనాలలో అసాంఘిక కార్యకలాపాలు జోరుగా సాగుతున్నాయి. ఈ గృహకల్పలో కేటాయించిన ప్లాట్ల యజమానులు ఇతరులకు అద్దెకిచ్చి వేరే ప్రాంతంలో నివాసం వుంటున్నారు. బయట నుంచి వచ్చి ఇక్కడ అద్దెకుంటున్న వారు చీకటి కార్యకలాపాలను నిర్వ హిస్తున్నారు. రాజీవ్ గృహకల్పపై పోలీసు నిఘా లేకపోవడంతో విచ్చల విడిగా ఈ కార్యకలాపాలు కొనసాగుతున్నాయి.

కొద్ది మంది ప్లాట్ల యజమానులు మాత్రమే ఇక్కడ నివాసం వుంటున్నారు. రాత్రి పగలు అనే తేడా లేకుండా సింగిల్ నెంబర్లాట, పేకాట, వ్యభిచారం ఇక్కడ జరుగుతుంది. రాత్రి సమయంలో అయితే ప్రధాన వీధుల్లోనే మద్యం సేవిస్తూ దారిన వెళ్లే వారి పట్ల అసభ్యంగా ప్రవర్తిస్తున్నారు. ఎవరైనా మద్యం బాబుల ఆగడాలను ప్రశ్నిస్తే బెదిరి స్తుంటారు. రాజీవ్ గృహకల్ప నగరానికి శివారున ఏర్పాటు చేయడం వల్ల ఎవరికీ అనుమానం రాదన్న ధీమాతో కొందరు వ్యక్తులు ఇక్కడ ప్లాట్లను అద్దెకు తీసుకుని తమ కార్యకలాపాలను సాఫీగా చక్క బెట్టుకొంటున్నారు.

పోలీసులకు ఇక్కడ జరిగే అసాంఘిక కార్యకలాపాల గురించి తెలిసినా కూడా పెద్దగా పట్టించుకోవడం లేదన్న ఆరోపణలు వినిపిస్తు న్నాయి. బయట ప్రాంతాల నుంచి యువతులను తీసుకొచ్చి గుట్టు చప్పుడు కాకుండా పడుపు వృత్తి నిర్వహిస్తున్నారు. అపార్టుమెంటు తర హాలో భవనాలు నిర్మించి వుండడంతో ఏ ప్లాట్లో పడుపు వృత్తి జరుగు తుందో తెలియక గుట్టుగా సంసారం చేసుకొంటున్న వారి ఇంటి తలు పులు తడుతున్నారు. దీంతో ఇంట్లో వున్న మహిళలు తీవ్ర భయాం దోళన చెందుతున్నారు. ఈ ప్రాంతానికి వచ్చే విటులు మద్యం సేవించి వుండడంతో అప్పుడప్పుడు ఘర్షణలు చోటుచేసుకొంటున్నాయి.

రాజీవ్ గృహకల్ప నిర్మాణ బాధ్యతలు తీసుకున్న గృహనిర్మాణ సంస్థ నిర్మాణాలు పూర్తిచేసి వీటి గురించి పట్టించుకోవడం మానేసింది. లబ్దిదారులను ఎంపిక చేసిన మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు సైతం చేతులు దులుపుకున్నారు. గృహకల్ప నిర్మాణానికి రుణం మం జూరు చేసిన బ్యాంకులు కూడా రుణాలు రికవరీ కాక ఇబ్బంది పడుతు న్నాయి. చీకటి కార్యకలాపాలకు రాజీవ్ గృహకల్ప ప్రస్తుతం కేంద్ర బిందువుగా వుంది. రాత్రి సమయంలో పోలీసులు గస్తీ చేయడం లేదని స్థానికులు చెబుతున్నారు.

నెల్లూరు నగరంలో పడుపువృత్తిలో బాగా ఆరితేరిన వారు పోలీ సుల బెడద వుండదన్న ధీమాతో తమ మకాం రాజీవ్ గృహకల్పకు మార్చారు. ఇటీవల ఈ గృహాలపై దాడులు జరిపి నిర్వాహకుల్ని అరెస్టు చేయడం జరిగింది. ఇక్కడ ఎవరికీ అనుమానం రాకుండా నిర్వహించ వచ్చని భావించారు. అయితే విటుల సందడి ఎక్కువ కావడంతో ఇక్కడ జరుగుతున్న చీకటి కార్యకలాపాల సమాచారం బయటకు పొక్కింది. ఇప్పటికైనా పోలీసులు స్పందించి చీకటి కార్యకలాపాలను నియం త్రించాలని ప్రజలు కోరుకొంటున్నారు.



నెల్లూరులోని రాజీవ్ గృహకల్ప సముదాయం.



అవినీతి కథ

# వైద్య ఆరోగ్య శాఖలో నిధుల స్వాహా!

**జాతీయ గ్రామీణ ఆరోగ్య పథకం, గ్రామస్థాయి పారిశుధ్యం, ఉప ఆరోగ్య కేంద్రాల పరిధిలో పారిశుధ్యం, కుటుంబ సంక్షేమ పథకాలకు విడుదలవుతున్న నిధులు ఒక పథకం ప్రకారం స్వాహా అవుతున్నాయి.**

రాష్ట్రప్రభుత్వం వివిధ కార్యక్రమాల అమలుకోసం జిల్లా వైద్య, ఆరోగ్యశాఖకు కేటాయిస్తున్న కోట్ల రూపాయల నిధులు ప్రక్కదారి పడుతున్నాయి. నిధులు మంజూరు చేస్తున్నా ఆశిం చిన లక్ష్యాలు సాధించడంలో ఆ శాఖ విఫలమవుతుంది. మండల స్థాయిలో, పంచాయితీ పరిధిలో చేపట్టాల్సిన వివిధ కార్యక్రమాలు చేపట్టకుండానే నిధులు ఖర్చు అయినట్లు లెక్కలు చూపుతున్నారు. జాతీయ గ్రామీణ ఆరోగ్య పథకం, గ్రామస్థాయి పారిశుధ్యం, ఉప ఆరోగ్య కేంద్రాల పరిధిలో పారిశుధ్యం, కుటుంబ సంక్షేమం తదితర పథకాలు అమలు కావడం లేదు.

## నిధులు మాయం

2008 సంవత్సరం నుంచి పై కార్యక్రమాలకు నిధులు మంజూరు అవుతున్నాయి. 2008-2009 ఆర్థిక సంవత్సరంలో 961 గ్రామ పంచాయితీ ఆరోగ్య కమిటీలకు దాదాపు రూ.93లక్షలు విడుదలయ్యాయి. 2009-10 ఆర్థిక సంవత్సరంలో రూ.88లక్షలు, 2010-11 సంవత్సరానికి సంబంధించి 90 లక్షల 50వేల రూపా యలు విడుదలయ్యాయి. పైసా మిగలకుండా నిధులు ఖర్చయి పోతున్నా పారిశుధ్యం మెరుగులో మాత్రం ఎటువంటి మార్పు కాన రావడం లేదు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల ఆధ్వర్యంలో ఏర్పాటు చేసినట్లు చెబుతున్న కమిటీలు పని చేయడం లేదు.

ప్రజలు వ్యాధుల బారిన పడకుండా ముందు జాగ్రత్తలు తీసు కొని, గ్రామీణ ప్రాంతాల్లో పారిశుధ్యం మెరుగుపరచాలని ప్రభుత్వం ఆదేశించినా వైద్య, ఆరోగ్యశాఖ సిబ్బందిలో మాత్రం చలనం కూడా లేదు. ప్రభుత్వం విడుదల చేసిన నిధుల్ని దేనికి ఖర్చు చేశారన్న వివ రాలు లభ్యం కావడం లేదు. వ్యాధులు విజృంభించి ప్రజలు అనా రోగ్యం పాలవుతున్నా అధికారులు సరైన పర్యవేక్షణ చేయడం లేదు.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలతోపాటు 477 ఉపఆరోగ్య కేంద్రా లున్నాయి. ఈ ఆరోగ్య కేంద్రాల పరిధిలో వైద్య, ఆరోగ్యశాఖ లెక్కల ప్రకారం 27లక్షల జనాభా వున్నారు. సబ్ సెంటర్ నందు గల ఆరోగ్య కమిటీలను సమావేశపరచి వీరి ఆధ్వర్యంలో పారిశుధ్య పనులు గుర్తించి పనులు పూర్తి చేయాల్సి వుంటుంది. గ్రామీణ ప్రాంతాల్లో ఆరోగ్య కమిటీల గురించి ప్రస్తావిస్తే ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నారు. ఆరోగ్య కమిటీలు అంటేనే ఏమిటి? అని తిరిగి ప్రశ్నిస్తున్నారు.

## కలిసి ఆరగింపు

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల వైద్యులు, సబ్‌సెంటర్ నిర్వాహ కులు, గ్రామ పంచాయితీ సర్పంచ్‌లు నిధుల్ని వాటాలుగా పంపిణీ చేసుకొంటున్నారన్న ఆరోపణలు వున్నాయి. ప్రజలు అంటువ్యాధుల బారినపడి అనేక ఇబ్బందులు పడుతున్నా ఎవరు కూడా పట్టించు కున్న దాఖలాల్లేవు. సబ్‌సెంటర్లకు 2008 - 09 ఆర్థిక సంవత్స రంలో రూ.47లక్షల 40వేలు, 2009 - 10 సంవత్సరంలో రూ.38 లక్షల 40వేలు విడుదల చేయగా, 2010 - 11 ఆర్థిక సంవత్సరానికి 42లక్షలు 16వేల రూపాయలు విడుదల చేసేందుకు కలెక్టర్‌కు ప్రతి పాదనలు వెళ్లాయి.

ఇదిలా వుండగా కుటుంబ సంక్షేమ విభాగం ఆధ్వర్యంలో చేపట్టే కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్సలకు ఖర్చు చేసిన నిధుల లెక్కలు తేల్చడం లేదు. దీనికి సంబంధించి గతంలో ఖర్చు చేసిన నిధులు దుర్వినియోగం జరిగాయి. ఇందుకు కారణమైన వారిపై ప్రభుత్వపరంగా ఎటువంటి చర్యలు లేకపోవడంతో మరిన్ని అక్ర మాలకు ఆస్కారం ఏర్పడింది. ప్రభుత్వ ఆసుపత్రులలో కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించుకున్న వారికి సకాలంలో పారితో షికం అందడం లేదు. దీంతో ఎక్కువ శాతం మంది ప్రైవేటు వైద్యశా లలకు వెళుతున్నారు. ఇప్పటికైనా ప్రభుత్వం స్పందించి ఈ శాఖ పనితీరుపై సమీక్షించాల్సిన అవసరం వుంది.



# సైరా షాదీ ఆగింది!



వ్యభిచార నేరంలో వర్ధమాన హీరోయిన్ సైరాభాను పట్టుబడిన విషయం విదితమే. ఈ సంఘటన ఆమె జీవితంలో పెద్ద సంచలనాన్ని రేపింది. సైరాకు ఇటీవల నిశ్చితార్థం జరిగింది. అబ్బాయిది సాంప్రదాయ ముస్లిం కుటుంబం కావడంతో ఆ కుటుంబీకులు నీకో దండం అంటూ నిశ్చితార్థాన్ని రద్దు చేసుకొన్నారట. ఈ ఘటన సైరాను బాగా బాధ పెట్టింది. పరిశ్రమలో బడా బడా హీరోయిన్లు ఈ పనిచేస్తున్నారు. నేనెంత అంటూ సన్నిహితులు దగ్గర వాపోతుంది. మొత్తానికి రెండింటికి చెడిన రేవడిలా తయారయ్యింది ఆమె పరిస్థితి.

# శ్రియ సరదా



హీరోయిన్ శ్రియకు ప్రయాణాలంటే చాలా ఇష్టం. షూటింగ్ కోసం అందమైన ప్రదేశాలకు వెళ్లి ఆ స్థల ప్రాశస్త్యాన్ని తెలుసుకోవటం, షాపింగ్ చేయడం శ్రియకు అలవాటు. ముఖ్యంగా చారిత్రక విలువ ఉన్న ప్రదేశాలకు వెళ్లేందుకు ఉత్సుకత చూపుతుంది. ఈ విషయమై మాట్లాడుతూ చిన్నప్పుడు హిమాలయాల దగ్గర నివాసముండడం మరచిపోలేని అనుభూతి అంటుంది. చిన్నప్పటి నుంచి దూరప్రయాణాలంటే ఇష్టం. బడలిక అసలు అనిపించదు. ప్రకృతి సౌందర్యాన్ని అనుక్షణం ఆస్వాదిస్తూ వెళ్తుంటాను. లండన్, పారిస్ నగరాలంటే ఇష్టమని చెప్పుకొచ్చింది శ్రియ.

# కుళ్లు త్రిష!



తెలుగు, తమిళ, హిందీ భాషా చిత్రాల్లో నటిస్తున్న హీరోయిన్ త్రిష ప్రక్కన వారికి అస్సలు సహాయం చేయని మనస్తత్వం. ఇతర హీరోయిన్ల పట్ల ఆమె ఏడుపు ఎక్కువేనని ఆమె బాధితులు చెబుతుంటారు. చిన్నతనం నుంచి త్రిషది ఇదే స్వభావమని ఆమె సన్నిహితులు చెబుతారు. స్నేహితులను బాగా మెయిన్‌టెన్ చేసే త్రిషకు గర్ల్‌ఫ్రెండ్స్ కంటే బాయ్ ఫ్రెండ్స్ ఎక్కువట. స్నేహితురాళ్లలో ఎవరైనా కాస్త మంచి దుస్తులు ధరిస్తే వెంటనే ఆమె ముఖం మాడిపోతుందట. బాగుంది త్రిష కుళ్లు వ్యవహారం.

# బీరు భామలు!

హీరో, హీరోయిన్ల జీవనశైలి విభిన్నంగా వుంటుంది. ఆడ, మగ సిగరెట్లు కాల్చటాలు, మందు స్వీకరించటాలు సహజంగానే పేజ్ 3లో దర్శనమిస్తుంటాయి. ఇది ఇలా వుంటే ఒకప్పుడు సిమ్రాన్, శ్రియ వంటి నాజూకు బొమ్మల్ని ఇష్టపడిన తెలుగు ప్రేక్షకులు ఈ మధ్య కాలంలో అసలు హీరోయిన్ అంటే అనుష్కలా వుండాలని బాహాటంగా చెబుతున్నారు. మరీ జీరోసైజ్‌లో కాకుండా హెల్తీగా వుండే అనుష్క ఫిగర్ అదుర్స్ అని అభిమానులు భావిస్తుండడంతో త్వరగా శరీరం లావై ఒంపుసొంపులు పెరగను రోజుకు రెండు బీర్లు చొప్పున లాగిస్తున్నారట వర్ధమాన హీరోయిన్లు తమన్నా, సమంతలు. బాగుందీ వరస...



# అమీషా కళ్లెందుకు తిరిగాయో!



కహోనా ప్యార్‌హై చిత్రంతో కుర్రకారును ఉర్రూతలూగించిన భామ అమీషాపటేల్. అమీషా బద్రి, నాని, నరసింహుడు చిత్రాల ద్వారా తెలుగు ప్రేక్షకులకు సైతం సుపరిచితురాలే. అమీషాపటేల్ కొత్త అందాలతో బాలకృష్ణ సరసన పరమవీరచక్రలో నటిస్తుంది. అయితే ఈ షూటింగ్ సందర్భంగా ఒక అవాంఛనీయ సంఘటన చోటుచేసుకొంది. షూటింగ్ స్పాట్‌లో అమీషా ఒక్కసారిగా కళ్లు తిరిగి పడిపోయింది. దీంతో నివ్వెరపోయిన యూనిట్ సభ్యులంతా వెంటనే ఆమెను హైదరాబాద్‌లోని ప్రముఖ ఆసుపత్రికి తరలించి చికిత్స చేయించారు. అయితే ఆమె కళ్లు తిరిగి పడిపోవడం వెనుక ఏదో విషయం దాగుందని బాలీవుడ్ వర్గాలు భావించి ఫిల్మ్‌నగర్‌లో ఆరా తీస్తున్నాయి.

# ఖలేజా ఖతం!



✍ అల్లూరు రహీం

అతిథి చిత్రం తర్వాత మూడేళ్ల గ్యాప్ తీసుకొని హీరో మహేష్‌బాబు నటించిన ఖలేజా చిత్రం ప్రేక్షకులను బాగా నిరాశపర్చింది. ఖలేజా అంటే గుండెకాయ. పేరు తగ్గట్టు ఈ చిత్రాన్ని గొప్పగా మలచడంలో మహానేర్పరిగా పేరుగాంచిన కథకుడు, మాటల రచయిత, దర్శకుడు కూడా అయిన త్రివిక్రమ్ చతికిలపడ్డాడు. మహేష్‌బాబు సీరియస్ పాత్రలకు బాగుంటాడు. ట్రెండ్ మార్చను ఆయన చేత కామెడీ చేయించే ప్రయత్నం ఖలేజాలో సఫలం కాలేదు. ఈ సినిమాను రెండున్నర గంటలకు కుదిస్తే బాగుండేది. సన్నివేశాల సాగతీత పేరిట మూడు గంటలు అనవసరంగా నడిపాడు. కథ మరుగుపరచి కంగాళీలపై దృష్టి ఎక్కువ పెట్టాడు. పాటలు సందర్భోచితంగా లేవు. గట్టిగా చెప్పుకొంటే ఓం నమో, పిలిచే పెదవుల పైన చరణాలతో సాగే రెండు పాటలే బాగున్నాయి. సినిమాలో మహేష్‌బాబు ఆంగికం, అభినయం, వాచికం గందరగోళంగా వున్నాయి. అయితే ఫైట్స్‌ను ఆయన హిమ్యాన్‌గా చేశాడు. దేవుడు ఎపిసోడ్ కాస్త అతిగానే వుంది. ఒకే లైన్ కథకు త్రివిక్రమ్ జతకూర్చిన సన్నివేశాల స్క్రీన్‌ప్లే అతకలేదు. కామెడీ బ్రహ్మాండంగా పండించే త్రివిక్రమ్ ఈ చిత్రంలో బ్రహ్మానందం, అలీల కామెడీతో నవ్వులు పూయించలేక పోయాడు. పైపెచ్చు తొక్కించుకోను వస్తాను, దాని సైజు చూశారా... అమ్మో దాని పిక్కల వంటి బూతు డైలాగులు వ్రాశాడు. కామెడీ చేస్తే నేనే చేయాలని హీరో మహేష్‌బాబు చేత ఎందుకు చెప్పించాడో అర్థమే కాదు. ఓ చోట వైఎస్ జగన్‌పై సెటైర్‌లా దేవుడు ఓదారుస్తున్నాడు... కాదు తడిమేస్తున్నాడు డైలాగు పలికించాడు. హీరోయిన్ అనుష్క ఈ చిత్రంలో శృతిమించి అందాల ప్రదర్శన చేసింది. ఓ చోట హీరోకు ముద్దు కూడా పెట్టింది. త్రివిక్రమ్ అనుష్కను ఈ చిత్రంలో ఓ ఐటమ్ గర్ల్‌లా వాడాడంటే అతిశయోక్తి కాదు.

ఇక చిత్ర కథలోనికి వెళ్తే సీతారామరాజు (మహేష్)కు చదువు అబ్బకపోవడంతో ఓ ట్రావెల్స్ సంస్థలో టాక్సీ డ్రైవర్‌గా చేరుతాడు. పారిశ్రామికవేత్త దుర్గాప్రసాద్ (తనికెళ్ల భరణి) కుమార్తె సుభాషిణి (అనుష్క) నాలుగైదు సార్లు రాజు కారును గుద్దేసి అతడ్ని తీవ్రంగా నష్టపోయేట్లు చేస్తుంది. పరిహారం అందించే క్రమంలో వారిద్దరి మధ్య పరిచయం పెరుగుతుంది. తన కారులో పయనిస్తూ మరణించిన దిలావర్ సింగ్ కుటుంబానికి ఎల్ఐసి పాలసీ తాలూకు చెక్కు ఐదు లక్షలు అందించను రాజస్థాన్ బయలుదేరుతాడు రాజు. ఎడారిలో జెమిని టీవీ రిపోర్టర్ బాబ్జి (సునీల్) పరిచయమవుతాడు. ఇదిలా వుండగా రాష్ట్ర సరిహద్దులోని పాలి గ్రామంలో జనం తెలియని వ్యాధితో చనిపోతుంటారు. ఈ సందర్భంగా జోతిష్యం చెప్పడంలో సామర్థ్యమున్న స్వామి (రావు రమేష్) తమ గ్రామాన్ని రక్షించే దేవుడు వస్తాడని అతడిని తీసుకోరమ్మని కొన్ని గుర్తులు చెప్పి సిద్ద (షఫీ)ని సరిహద్దులకు పంపుతాడు. సుభాషిణిని హెలికాప్టర్‌లో రాజస్థాన్ తీసుకొచ్చే పారిశ్రామికవేత్త జి.కె. (ప్రకాష్‌రాజ్) కొడుకు ఆమెను చెరచబోతాడు. తప్పించుకొని ఎడారిలో తిరుగుతుండే రాజుకు తారసపడుతుంది. అందరూ కలిసి దిలావర్‌సింగ్ కుటుంబానికి సాయం అందిస్తారు. సుభాషిణిది ఐరన్ లెగ్ అని రాజుతోపాటు బాబ్జి వీరికి ఎడారిలో స్నేహితుడయ్యే టామ్ బాయ్ (అలీ) ఒక అభిప్రాయానికి వస్తారు. జికె ఆదేశంతో గోవర్ధన్ (సుబ్బరాజు) సీతారామరాజుపై కత్తితో దాడి చేస్తాడు. ఈ సమయంలో రాజు వెళ్లి పాలిగ్రామ సరిహద్దులో పడతాడు. స్వామి చెప్పిన లక్షణాలన్నీ అతనిలో కనపడడంతో సిద్ధ అతన్ని గ్రామంలోకి తీసుకవెళ్తాడు. వైద్యం పూర్తయ్యాక రాజును గ్రామస్తులంతా దేవుడంటారు. ఎంత కాదన్నా ఒప్పుకోరు. గ్రామస్తులు చనిపోవడంపై రాజు తీగలాగగా డొంకంతా కదులుతుంది. పాలిగ్రామంలో అత్యంత విలువైన ఖనిజం హిరీడియం వుంటుంది. దీన్ని స్వాధీనం చేసుకోను జికె, దుర్గాప్రసాద్ కలిసి గ్రామస్తులు త్రాగే నీటిలో రసాయన మలినాలు వదలి వారు చనిపోయేట్లు చేస్తారు. రాజు దేముడి అవతారం ఎత్తి దుష్టశిక్షణ శిష్ట రక్షణ చేయడంతో సినిమా ముగుస్తుంది.

త్రివిక్రమ్ మీద నమ్మకంతో ఈ చిత్రం ఒప్పుకొని హీరో మహేష్‌బాబు కెరీర్‌పై దెబ్బ వేసుకున్నాడు. హీరోయిన్ అనుష్క దేహ ప్రదర్శనకే పరిమిత మయ్యింది. విచిత్రమైన పాత్రల్లో కనిపించే రావు రమేష్, షఫీలు ప్రేక్షకులను ఆకట్టుకొంటారు. ప్రకాష్‌రాజ్ చివరి సన్నివేశంలో జీవించగా, తనికెళ్ల భరణి పాత్ర కుదించడంతో ఆయన నటనకు అవకాశం లేకుండా పోయింది.



• పనిచేయని

## కార్పొరేషన్ సర్వేయర్లు!

నెల్లూరు కార్పొరేషన్ పరిధిలో వివాదాస్పద స్థలాలు వాటి సర్వేనెంబర్లు, హద్దులు తదితర విషయాలన్నీ పరిశీలించేందుకు ముగ్గురు సర్వేయర్లున్నారు. పేరుకు ముగ్గురున్నారు గాని వారు పని చేయడం లేదు. వాస్తవానికి కార్పొరేషన్‌లో వున్న ఇద్దరు సర్వేయర్ల దద్దమ్మలని తలచి సర్వే డిపార్ట్‌మెంట్ నుంచి మునిసిపాలిటీ జీతమిచ్చేలా సర్వేయర్ శ్రీరాములును తెచ్చిపెట్టుకొన్నారు. ప్రజా అవసరాలకు ప్రజలు కార్పొరేషన్‌లో చలనా కట్టి అర్జీ పెట్టుకొంటే ఈ అధికారి వెళ్ళి విషయాన్ని పరిశీలించి పరిష్కారాన్ని సూచించాలి. అయ్యగారు నియమితులైనప్పటి నుంచి జీతం డ్రా చేసుకొనే రోజు తప్ప మరో రోజు కార్యాలయానికి రావడం లేదు. ఈయనే పరిష్కరించాల్సిన ప్రజా విజ్ఞప్తులు లెక్కలేనన్ని పెండింగ్‌లో వున్నాయి. కార్పొరేషన్ కమిషనర్ గారికి ఈ వ్యవహారాలేమి పట్టవు. కనీసం ఇన్‌ఛార్జి పాలనాధికారియైన సహాయ కలెక్టర్ సీతారామయ్య గారైన కార్పొరేషన్ సర్వేయర్ల చేత పని చేయించాల్సి వుంది.

**పేరుకు పోతున్న ఫైళ్లు**

## కొత్త దారులు వెతుకుతున్న పోస్టల్ శాఖ



ఆధునిక హంగులతో పెద్ద పోస్టాఫీసులో కౌంటర్లు.

తపాలాశాఖ ఆదాయం బాగా తగ్గుతుండదంతో దీని పెంపుకు కొత్త మార్గాలు వెతుకుతోంది. సెల్‌ఫోన్ రంగం విస్తరించదంతో జాబు ముక్క వ్రాసేవారు కరవయ్యారు. దీంతో వేలకొలది కార్డులు, ఇన్‌ల్యాండ్ కవర్లు పోస్టాఫీసులో స్టాకున్నాయి. తోచీ తోచనపుడు పోస్ట్ మాస్టర్లు వీటిని వినియోగించుకొంటున్నారు. బ్యాంకు రంగంలో ఏటిఎంలు రావడంతో మని యార్డర్లు తగ్గిపోయాయి.

దీంతో శాఖకు కాయ కల్పచికిత్స చేసే పనిలో పడ్డ అధికారులు స్పీడ్‌పోస్టు, ఎక్స్‌ప్రెస్ పార్శిల్ పోస్టు, బిజినెస్ పోస్టు, మేఘదూత్ మీడియా పోస్టుల ద్వారా ఒకే ఒక్క రోజులోనే సేవలందేలా చూస్తున్నారు. కొరియర్లకు ధీటుగా 25 రూపాయలతో సమాచారం పంపే సదుపాయం కల్పిస్తున్నారు. నెల్లూరు, గూడూరు, కావలి పోస్టాఫీసుల్లో రైల్వే రిజర్వేషన్ కౌంటర్లు ఏర్పాటు చేస్తున్నారు. ఐసిఐసిఐ ఇన్సురెన్సుతో ఒప్పందం చేసుకొని బీమా సేవలు అందుబాటులోకి తెస్తున్నారు. ఆర్‌పిఎల్‌ఐ, పిఎల్‌ఐ పథకాలను జనానికి చేరువ చేయాలనుకొంటున్నారు. నెల్లూరు పోస్టల్ ఎస్పీ మంచివాడైనా సిబ్బంది ఆయన మాట వినడం లేదు.

• గాంధీనగర్

## సాయిబాబా మందిరంలో దసరా!



నెల్లూరు గాంధీనగర్‌లోని షిర్డి సాయి మందిరంలో బాబా విజయదశమి మహాసమాధి ఉత్సవాలు 17, 18, 19 తేదీల్లో వైభవంగా జరగనున్నాయి. ప్రతి రోజూ ఉదయం మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకాలు, సహస్రనామ పూజలు జరుగుతాయి. షిరిడి హారతులు వుంటాయి. ప్రతినిత్యం సాయంత్రం ఏడుగంటలకు సాహిత్య కార్యక్రమాలుంటాయి. ప్రత్యేక పూజల్లో పాల్గొనాలనుకొనేవారు మందిరంలో పేర్లు నమోదు చేసుకోవాలి. సాయి భక్తులందరిని ఈ కార్యక్రమాల్లో పాల్గొనమంటున్నాడు మందిరం ఛైర్మన్ మన్నెం అమర్‌నాథ్‌రెడ్డి.

• చేతులెత్తేసిన వ్యవసాయశాఖ

## వేధిస్తున్న విత్తనాల కొరత

వ్యవసాయానికి అదను ప్రారంభమైంది. సోమశిల ప్రాజెక్టు ద్వారా తొలి కారుకు నీటిని విడుదల చేయమని గతవారం జరిగిన సాగునీటి సలహాబోర్డు సమావేశం తీర్మానించింది. నాలుగున్నర లక్షల ఎకరాలకు అధికారికంగా నీటి సరఫరాకు పంచజెండా ఊపింది. ఎవరు కాదన్నా మరో రెండు లక్షల ఎకరాల్లో అనధికారికంగా పంటను పండిస్తారు. నార్లు వేయను సిద్ధపడుతున్న రైతులను విత్తనాల కొరత వేధిస్తుంది. జిల్లాలో బిపిటి 5204, (జిలకర మసూరి) ఎంటియు 1010, ఎన్ఎల్ఆర్ 3449 (నెల్లూరు జిలకర) 1009 (మూడు పిడికెళ్ళు) రకాల విత్తనాలు చల్లుతారు. గత ఏడాది ఎన్ఎల్ఆర్ 3449



విత్తనాలకు పనికి రాకుండా పోయిన రైతులు పండించిన ధాన్యం.

బిపిటి 5204 రకాలను వేశారు. తెగుళ్లు, వర్షాలకు పంట దెబ్బతినదంతో గిట్టుబాటు ధర లేక నష్టపోయారు. దీని వల్ల రైతులందరు 1009, 1010 రకాలు వేయను సిద్ధపడ్డారు. దీంతో ఈ రెండు రకాలకు విత్తన కొరత ఏర్పడింది. వ్యవసాయశాఖ 10శాతం కూడా విత్తనాలు సరఫరా చేయలేక చేతులెత్తేసింది. బయట కొనుగోలు ధర ఎక్కువ కావడంతో రైతులు అల్లాడిపోతున్నారు. సహజంగా నారు పోయాలంటే ఎకరాకు 30 కిలోల విత్తనాలు కావాలి. సగటున జిల్లాలో 18లక్షల టన్నుల విత్తనాలు అవసరం. కాని వ్యవసాయశాఖ దగ్గర 1500 టన్నులు మాత్రమే విత్తనం వుంది. బిపిటి రకం విత్తనాలు ప్రభుత్వం కిలో 21రూపాయలకు విక్రయిస్తే బయట 50రూపాయలుగా అమ్ముతున్నారు. తెలంగాణ, అనంతపురం ప్రాంతాల్లో మాదిరి నెల్లూరు రైతులు గొడవలకు దిగరు. ఈ బలహీనతే అధికారులను రక్షిస్తుంది. విత్తనాల కొరత తీర్చను కలెక్టర్ దృష్టి పెట్టాలి.





స్వర్ణభారత్ ట్రస్ట్‌లో సివిల్ పరీక్షలకు హాజరయ్యే విద్యార్థుల కోసం నిర్వహించిన అవగాహన సదస్సులో జ్యోతి వెలిగిస్తున్న ప్రొఫెసర్ బాల గురుస్వామి.

## మారిపోతున్న ఐఎఎస్, ఐపిఎస్‌లు!

వెంకటాచలంలోని స్వర్ణభారత్ ట్రస్టు ఆధ్వర్యంలో ఐ.ఏ.ఎస్, ఐ.పి.ఎస్ పరీక్షలకు హాజరయ్యే అభ్యర్థులకు అవగాహన సదస్సును 10తేది నిర్వహించారు. ఈ అవగాహన సదస్సుకు ముఖ్య అతిథులుగా పలువురు ఐఏఎస్, ఐపిఎస్ అధికారులు హాజరయ్యారు. ఈ సందర్భంగా జిల్లా కలెక్టర్ ఠి.రాంగోపాల్ మాట్లాడుతూ కృషి, పట్టుదల వుంటే దేనినైనా సాధించవచ్చని చెప్పారు. సివిల్ సర్వీస్, పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఆధ్వర్యంలో నిర్వహించే పోటీ పరీక్షలకు హాజరయ్యే వారికి అవగాహన సదస్సు నిర్వహించడం అభినందనీయమన్నారు.

జిల్లా ఎస్పీ ఇ.దామోదర్ మాట్లాడుతూ అనుకున్న లక్ష్యాన్ని సాధించేందుకు నేటి యువత ఎంతో సంకల్పంతో వుందన్నారు. పరీక్షలకు హాజరయ్యేవారు భయం, ఆందోళన చెందాల్సిన అవసరం లేదన్నారు. స్వర్ణభారత్ ట్రస్టు ఆధ్వర్యంలో ఇటువంటి కార్యక్రమాలు చేపట్టడం యువతకు ఎంతో మేలు చేకూరుతుందన్నారు. అన్నామలై యూనివర్శిటీ మాజీ వైస్ చాన్సలర్ బాలగురుస్వామి మాట్లాడుతూ అవగాహన సదస్సుకు హాజరైన విద్యార్థులు, వేదికపై వున్న అధికారులకు చురకటించారు. ఐఎఎస్, ఐపిఎస్‌లకు ఎంపికయ్యేందుకు చూపించిన శ్రద్ధ ఉద్యోగంలో చేరిన తర్వాత చూపించడం లేదన్నారు. వృత్తికే కళంకం తెచ్చే విధంగా కొందరు వ్యవహరిస్తున్న తీరు బాధాకరంగా వుందన్నారు.

ఈ కార్యక్రమంలో బిజెపి నాయకుడు ఎం.వెంకయ్యనాయుడు, పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టర్ ఎం.రవిచంద్ర పలువురు అధికారులు పాల్గొన్నారు.



తూర్పు కనుపూరు ముత్యాలమ్మ దేవస్థానం నూతన పాలక మండలి పదవీ స్వీకార సభలో మాట్లాడుతున్న మంత్రి ఆనం రామనారాయణరెడ్డి. ప్రక్కన దేవస్థానం ఛైర్మన్ వేమారెడ్డి మురళీమోహన్‌రెడ్డి, కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి, నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి తదితరులు.



సిపిఎం జిల్లా కార్యదర్శి టి.పి.భానురాజు కుమారుడు టి.పి.శిరీష్, వశితారాణిల పెండ్లి సెప్టెంబర్ 30వ తేది నెల్లూరు అనిల్ గార్డెన్స్‌లో జరిగింది.

## రాహుల్‌గాంధీ

15వ పేజీ కొరవ

24 గంటల పాటు ఉచితంగా వైద్యం చేయాలన్నది ఈ చట్టంలోని ప్రధాన అంశం. అపోలో వంటి కార్పొరేట్ ఆస్పత్రులకు కూడా ఇది వర్తిస్తుంది. ఆ తర్వాత కూడా వైద్యం ఖర్చు భరించలేని పేదలకు దగ్గరలోని ప్రభుత్వ ఆస్పత్రిలో, అది అందుబాటులో లేకుంటే కార్పొరేట్ ఆస్పత్రులలో వైద్యం చేయించే బాధ్యత ప్రభుత్వమే వహించాలి. అందుకయ్యే ఖర్చు మొత్తం ప్రభుత్వమే భరించాలి.

### ప్రజల చేతిలో పాశుపతాస్త్రం

సమాచార హక్కు చట్టం ప్రజల చేతిలో పాసుపతాస్త్రంతో సమానం. అలనాటి అర్జునుడు ఆ అస్త్రాన్ని వినియోగించి కౌరవ సేనను తుద ముట్టించినట్లు, ఈ చట్టాన్ని సరైన రీతిలో ప్రయోగిస్తే కౌరవ మూకలకంటే హీనంగా భారతీయ సమాజాన్ని పీల్చి పిప్పి చేస్తున్న అధికార యంత్రాంగపు దుర్నీతిని దునుమాడవచ్చు. సమాజ వృక్షాన్ని శిథిలం చేస్తున్న వేరుపురుగుల వంటి ఐఎఎస్ అధికారులు కొందరు ఈ పాసుపతాస్త్రానికి పాచి పట్టిస్తున్న మాట నిజమే. కానీ ప్రభుత్వ వ్యవహారాలలో పారదర్శకతను సాధించే దశలో ఈ చట్టం సాధిస్తున్న విజయాలను అటువంటి అధికారులు అడ్డుకోలేక పోతున్నారు. గ్రామస్థాయి నుంచి కేంద్ర ప్రభుత్వం వరకు కొన్ని వేల అవినీతి కుంభకోణాలు, అధికార యంత్రాంగపు అక్రమాలు, చివరకు న్యాయస్థానాలలో జరిగే అవకతవకలను కూడా సమాచార హక్కు చట్టం వెలుగులోకి తెస్తున్నది.

ఇందులో ఏ పది శాతం విజయం సాధించినా ప్రపంచ చరిత్రలో రాహుల్‌గాంధీకి అత్యున్నత స్థానం లభి స్తుందనడంలో సందేహం లేదు. అంతటి మహత్తర తపస్సును, మహిమాన్వితమైన ఆదర్శాలను తన భుజాలకెత్తుకొంటున్న రాహుల్ గాంధీకి యువతరం మొత్తం అండగా నిలవడం, ఆ మహోద్యమంలో తాము భాగస్వాములు కావడం అవసరం. కేవలం అధికారం సాధించడమే రాహుల్ లక్ష్యమైతే, మన్మోహన్‌సింగ్‌ను దించి తాను ప్రధాని పీఠం ఎక్కడం క్షణంలో సగం సేపు కూడా పట్టదు. కానీ తన అధికారం కంటే, తన దేశ ప్రజల బ్రతుకులలో వెలుగులు చూడాలన్న మహత్తర సంకల్పం ఆయన్ను ముందుకు నడిపిస్తున్నది. ఆ అడుగులలో మనమూ కాలు కలుపుదాం.

## శంకరన్

8వ పేజీ కొరవ

లోకి రాలేదు. గ్రామాలలో దళితులు, గిరిజనుల జీవనం చాలా దుర్భరంగా వుండేది. భూస్వాములు, రైతుల దయాదాక్షిణ్యాల మీద, వారు చూపించిన చిన్నపాటి ప్రదేశంలో, వారిచ్చే తాటి ఆకులు తెచ్చుకొని గుడిసెలు వేసుకోవాలి. ఆ భూస్వామికి ఏ కారణంతో కోపం వచ్చినా, గుడిసె పీకి పారేసేవాడు. ఆ దళితుడికి ఇక నిలువ నీడ వుండేది కాదు. దానితో గ్రామాలలోని దళితులు భూస్వాములకు పూడిగం చేయక తప్పేది కాదు. ఈ పరిస్థితిని గమనించిన శంకరన్, పేద ప్రజలకు వేల సంఖ్యలో ఇళ్ల స్థలాలు ఇచ్చాడు. ప్రభుత్వ భూమిని పట్టాలుగా ఇవ్వడానికి ఎన్నో ఆంక్షలున్న కాలమది. పేదల దుర్భర పరిస్థితి చూసి, చలించి పోయిన ఆయన, తన పై అధికారుల చేత తిట్లు తినడానికి కూడా సందేహించేవాడు కాదు. శంకరన్ పుణ్యాన స్వంత స్థలం అంటూ సంపాదించి, ఆత్మగౌరవంతో బ్రతకడం నేర్చిన నిరుపేదల గుడిసెలలో ఆయన ఫోటో, దేముడి పటం పక్కన స్థానం సంపాదించుకొన్నది. కొన్నివేల గుడిసెలలో శంకరన్ ప్రత్యక్ష దైవం క్రింద లెక్క. ఇప్పటితరానికి ఆయన చేసిన ఉపకారం ఎంత గొప్పదో చెప్పినా అర్థంకాదు.

ముఖ్యమంత్రి చెన్నారెడ్డితో సాంఘిక సంక్షేమ పథకాల విషయంలో పేచీ వచ్చింది ఒకసారి. ఉద్యోగానికి సెలవు పెట్టాడు తప్ప, చెన్నారెడ్డితో రాజీ పడలేదు. అది తెలిసి, త్రిపుర ముఖ్యమంత్రి నృపేన్ చక్రవర్తి ఆయన్ను తమ రాష్ట్రానికి తీసుక వెళ్లాడు. అక్కడున్న మూడు నాలుగేళ్లలో శంకరన్ చేసిన సేవను ఆ రాష్ట్ర ప్రజలు ఇప్పటికీ కథలు కథలుగా చెప్పుకొంటారు. శంకరన్ విషయంలో తానెంత తప్పు చేసిందీ ఆలస్యంగా అర్థం చేసుకొన్న చెన్నారెడ్డి, ఆ తర్వాత ఆయనకు క్షమాపణ చెప్పాడు.

శంకరన్ గురించి ఎంత చెప్పినా, ఎంత వ్రాసినా తక్కువే. మనుషులలో మహాత్ముడు, సామాన్యులలో మాన్యుడు ఆయన. ఆయన మరణం సమాజ సేవా రంగానికి తీరని లోపం. స్వర్గంలో ఏదో పని వుండి దేముడు ఆయన్ను తీసుకవెళ్లినట్లున్నాడు. ఆ మహానుభావుడి స్మృతికి శ్రద్ధాంజలి ఘటించడం తప్ప మనం చేయగల్గింది ఏదీ లేదు.

## దేముడూ క్షమించని పాపం

8వ పేజీ కొరవ

దాన్ని రద్దు చేసి, ఆ విద్యార్థినులను ప్రభుత్వ హాస్టళ్లకు బదలీ చేసింది. కానీ రమేష్ ఆ తర్వాత ఆ సంస్థ యాజమాన్యంతో బేరం కుదుర్చుకొని, ఆ వసతి గృహానికి మళ్లీ అనుమతి ఇప్పించి, అమాయక గిరిజన విద్యార్థినులను కామాంధులకు అప్పచెప్పాడని ఒక ఆరోపణ – వుంది. ట్రైనింగ్ సెంటర్లు, టైలరింగ్ సెంటర్లు, అవినీతికి ఆలవాలమై పోతున్నాయని గోల. రమేష్ మీద ప్రధానంగా వినిపించే ఆరోపణ మహిళల పట్ల అనుచిత ప్రవర్తన. ఇవన్నీ తెలిసి, గిరిజన శాఖ వున్నతాధికారిణి శ్రీమతి శాంతకుమారి, అతడిని వెంటనే అక్కడ నుంచి బదలీ చేయమని ఆదేశాలిచ్చారు. కానీ రమేష్ "సేవ"లో తరిస్తున్న నెల్లూరుజిల్లా అధికారులు, రాజకీయవాదులు కలిసి ముఖ్యమంత్రి వద్దకు రాయబారం నడిపి ఆయన్ను కొనసాగించమని ఉత్తర్వు తెచ్చారు. దానితో తననెవరూ ఏమీ చేయలేరన్న ధైర్యం పెంచుకొన్న రమేష్, తన మీద ఆరోపణలు చేసిన వారందరి మీద గిరిజన అత్యాచార కేసులు పెడతానని బెదరిస్తున్నాడు.

ఏమిటీ పాడు పనులు? అమాయక గిరిజనుల జీవితాలను ఛిద్రం చేసి వారి నోళ్లు కొట్టి ఆ సొమ్ముతో తమకందించే "సేవల"కు జిల్లా అధికారులు, రాజకీయవాదులు కక్కుర్తిపడడం ఎంత ఘోరం? అటువంటి అధికారిని తాముగా పూనుకొని సాగనంపవలసింది పోయి, నెత్తిన పెట్టుకొని వూరేగడానికి సిద్ధపడడం ఏమిటి? ఇటువంటి పాపాలు వూరకే పోవు. ఇప్పటికైనా జిల్లా అధికార గణం తమ తప్పును సరిదిద్దుకొంటే దేముడైనా క్షమిస్తాడు. లేకుంటే, వారి పాపాలన్నిటినీ ప్రజల ముందు పెట్టవలసి వస్తుంది, జాగ్రత్త.




## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

ఒకరు జిల్లాలో జరుగుతున్న అవినీతి, అక్రమాలు, అబందరలపై ప్రజల తరఫున మాట్లాడకుంటే ఎలా?

### రాజకీయాలు మాట్లాడిన సుమన్

తన అభిమానులు నిర్వహించిన రక్తదాన శిబిరం ప్రారంభోత్సవానికి నెల్లూరు వచ్చిన సినీనటుడు సుమన్ రాజకీయాలు మాట్లాడారు. కడప ఎమ్పీ వైఎస్ జగన్మోహన్‌రెడ్డి చేపడుతున్న ఓదార్పు యాత్రపై అనవసర రాద్ధాంతం వద్దన్నారు. ఈ యాత్ర వల్ల కాంగ్రెస్ పార్టీకి లాభమేకానీ నష్టం లేదన్నారు. దివంగత నేత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేపట్టిన రాజీవ్ ఆరోగ్యశ్రీ, రైతులకు ఉచిత విద్యుత్ గొప్ప పథకాలన్నారు.

### పెళ్లి పెద్దగా సిపిఐ నారాయణ

సిపిఐ రాష్ట్ర కార్యదర్శి నారాయణ గతవారం రెండు రోజులు నెల్లూరులో మకాం చేశారు. ఓ రోజు ఉదయం ఎసి స్టేడియంలో నారాయణ జాగింగ్‌కు వచ్చారు. పార్టీ కార్యకర్తల సమావేశంలో పాల్గొన్నారు. నారాయణ రెండు రోజుల మకాంకు కారణమేమిటని విచారిస్తే నెల్లూరు ఫత్తేఖాన్‌పేటలోని సిపిఐ పార్టీ అనుబంధిత న్యాయవాది జెసిఎస్ అమర్‌నాథ్, ఎపిడబ్ల్యుజె రాష్ట్ర అధ్యక్షుడు సోమసుందర్ కుటుంబాలు వియ్యమొందిన సందర్భంగా పార్టీ పెద్దగా నిశ్చితార్థానికి హాజరయ్యి ఇక్కడ హల్‌చల్ చేసినట్లు తెలిసింది.

### నాన్‌స్టాప్ మాటల నగర డిఎస్పీ!

నెల్లూరు నగర డిఎస్పీ రాధికకు పెన్న నీళ్లు బాగా పట్టినట్లున్నాయి. గతంలో ముక్తసరిగా మాట్లాడే ఆమె ప్రస్తుతం నాన్‌స్టాప్‌గా మాట్లాడే స్థాయికి ఎదిగారు. 12వ తేది ఓ ఘరానా దొంగల ముఠాను అరెస్ట్‌చేసిన సందర్భంగా సెంట్రల్ క్రైం స్టేషన్‌లో ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో ఆది నుంచి అంతం వరకు గుక్కతిప్పుకోకుండా మాట్లాడి అందర్నీ ఆశ్చర్యపర్చారు.

## ప్రసన్న పాపం పండింది

మొదటి పేజీ కొరవ

వేటు నిర్ణయం తీసుకొంటే మాత్రం ప్రసన్న పాపం పండినట్ల లెక్క.

ఒకవేళ ఎమ్మెల్యే పదవి పోతే ఉప ఎన్నిక తప్పదు. ప్రసన్నకు ఈసారి కాంగ్రెస్ టిక్కెట్ రాదు. తెలుగుదేశం అవకాశం లేదు. జగన్ అభ్యర్థిగా పోటీకి దిగాలి. రాష్ట్రంలో జగన్ పెట్టబోయే పార్టీకి ఇదొక పరీక్ష కాబోతుంది.

## జనవాణి

2వ పేజీ కొరవ

నన్నెంతో బాధ పెట్టింది. శంకరన్‌గారు కలెక్టర్లకు గురువు. డజన్ల మంది ఐఎఎస్ అధికార్లను తీర్చి దిద్దిన ఘనత ఆయనది. సామాన్య ప్రజలకు అందులో ఎస్సీ, ఎస్టీ పేద వర్గాలకు శంకరన్ చేసిన సేవ అతీతం. వారి హక్కులకు రిటైరు అయిన తర్వాత కూడా విధి విరామం లేకుండా శ్రమించాడు. సంభవామి యుగే యుగే అన్నట్లు భవిష్యత్తులో ఒకరిద్దరు కలెక్టర్లయినా శంకరన్ బాటలో నడిచి ఆ పేరును చిరస్థాయిగా నిలుపుతారని ఆశిస్తున్నాను.

*వేములపాటి అనంతరామయ్య* నెల్లూరు

### చాలా సంతోషం

జిల్లాలో వెనుకబడిన ప్రాంతమైన వెంకటగిరిని మునిసిపాలిటీ చేయడమే కాకుండా అక్కడ అందమైన మునిసిపల్ భవనాన్ని నిర్మించిన పాలకులు అభినందనీయులు. ఇక్కడకు భెల్ పరిశ్రమను తీసుకొచ్చిన నేతలందరికీ ప్రజలు సదా రుణపడి వుండాలి. గతంలో వెంకటగిరి గుండా తెలుగుగంగ కాల్వను త్రవ్వించిన ఘనత స్వర్గీయ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిది. ఇక్కడ ఆయన పేరు నిలబడేలా ఏదో ఒక పథకానికి శీనయ్య పేరు పెట్టేందుకు నేతలు ఆలోచించ మనవి.

*కె.సునీత* *వెంకటగిరి*

## రోశయ్యకు అవమానం

మొదటి పేజీ కొరవ

వద్దని అధిష్టానం చెప్పున్నా కెవిపిని అక్కున చేర్చుకోవడం ద్వారా రెండింటికీ చెడ్డ రేవడి అయిపోయాడు ముఖ్యమంత్రి.

ఈ పరిస్థితి సర్దుబాటు కావాలంటే, పాలనాపరంగా, రాజకీయంగా కొన్ని కఠిన నిర్ణయాలు తప్పవు. జగన్ అవినీతి కుంభకోణాలను కప్పి పెట్టే ప్రయత్నం మానుకొని, ఎమ్మార్ ఎంజిఎఫ్ దగా వంటి అంశాలలో స్థిర నిర్ణయం తీసుకొంటే తప్ప రోశయ్యకు ముఖ్యమంత్రిగా విలువ మిగలదు.

# దేశ ప్రజల బ్రతుకులలో వెలుగులు చూడాలన్నదే రాహుల్‌గాంధీ లక్ష్యం!

( 5వ పేజీ కొరవ )

చట్టాలను రైట్ టు ఫుడ్, రైట్ టు ఎడ్యుకేషన్, రైట్ టు హెల్త్, రైట్ టు ఎంప్లాయిమెంట్ అని పేర్కొంటున్నారు. తిండిలేక ఆకలితో బాధపడేవాడు, చదువు లేక అనాగరికంగా బ్రతికేవాడు, ఆరోగ్యం కోసం ఇల్లువాకిలి అమ్ముకొనే దీనుడు, చేయడానికి పని లేక సమాజ నిరాదరణకు గురయ్యేవాడు కనపడని భారతదేశాన్ని నిర్మించాలన్నది రాహుల్ సంకల్పం. కారల్‌మార్క్స్ పుస్తకాలలో, మావో సెటూంగ్ ఉపన్యాసాలలో, లెనిన్ ఆదర్శాలలో మాత్రమే కన్పించే ఈ సుందర స్వప్నాన్ని నిజం చేయడానికి ప్రజాస్వామిక మార్గంలో నడుం కడుతున్నాడు రాహుల్‌గాంధీ.

## అడిగినవారికల్లా అన్నం

రాహుల్‌గాంధీ తలపెట్టిన నూతన చట్టాలన్నిటి లోకి అత్యంత విప్లవాత్మకమైనది – ఆహార హక్కు చట్టం. దేశంలోని ప్రజలందరికీ ఆరోగ్యవంతమైన, ఆచారాలకు తగిన, పోషక పదార్థాలతో కూడిన ఆహారం అందజేయడం ఈ చట్టం లక్ష్యం. గ్యారంటీ ఆఫ్ ఫుడ్ సేఫ్టీ అండ్ సెక్యూరిటీ యాక్ట్‌గా పిలవబడుతున్న ఈ నూతన చట్టం పేద ప్రజల పాలిట ఒక వరం. పేదరికపు అంచుకు చేరువలో వుండే ప్రతి కుటుంబానికీ ప్రతి నెలా కిలో మూడు రూపాయల లెక్కన బియ్యం లేదా గోధుమలు సరఫరా చేయడం, వాటికి అనుబంధంగా పప్పు ధాన్యాలు, నూనె గింజలు, ఇతర పోషక పదార్థాలను సైతం అవసరాలకు తగినట్లు అందించడం దీని ఆశయం. అయితే ఈ చట్టాన్ని ప్రధాని మన్మోహన్‌సింగ్ తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. అంత డబ్బు ప్రభుత్వం దగ్గర లేదు, అంత మొత్తంలో బియ్యం, గోధుమలు దేశంలో పండడం లేదు అని వాదిస్తున్నాడు ప్రధాని. ప్లానింగ్ కమిషన్ ఛైర్మన్ మాంటెక్ సింగ్ అహ్లూవాలియా సైతం అదే వాదన విన్పిస్తున్నాడు. ఈ చట్టాన్ని అమలు చేయాలంటే ఇప్పటి అంచనాల ప్రకారం 6 కోట్ల టన్నుల బియ్యం, గోధుమలు అవసరమట. అయితే దేశంలో ప్రభుత్వపరంగా సేకరిస్తున్న ధాన్యం 4కోట్లా 70 లక్షల టన్నులు మాత్రమే వుంది. ఈ రెండింటి మధ్య కొరతను పూడ్చాలంటే బహిరంగ మార్కెట్ నుంచి ధాన్యం కొనాలి. అంత డబ్బు ప్రభుత్వం వద్ద లేదన్నది ప్రధాని అభ్యంతరం. ఇప్పటికే అంత్యోదయ, అన్నపూర్ణ వంటి పథకాల ద్వారా పేదలకు బియ్యం ఇస్తున్నాము కాబట్టి, కొత్తగా ఆహార భద్రత చట్టం అవసరం లేదని మన్మోహన్‌సింగ్ చెప్తున్నాడు. కానీ రాహుల్‌గాంధీ అందుకు ఒప్పుకోవడం లేదు. ఆహార భద్రత అంటే, కేవలం బియ్యం ఇవ్వడం కాదన్నది రాహుల్ భావన.

ఒక మనిషి ఆరోగ్యంగా వుండాలంటే రోజుకు కనీసం 50 గ్రాముల ప్రొటీన్ తీసుకోవాలట. అమెరికా వంటి పాశ్చాత్య దేశాలలో ఈ ప్రమాణం పాటిస్తున్నారు. కానీ మనదేశంలో సగటు ప్రొటీన్ వాడకం 10 గ్రాముల లోపలే వుంటున్నది. అందువల్లనే మనవాళ్లు అనారోగ్యం పాలౌతున్నారు. కష్టించి పని చేయలేక పోతున్నారు. మాంసాహారులకు కొంత వరకు ప్రొటీన్ లభిస్తుంది. కానీ శాకాహారం మీద ఆధారపడే వారు కనీసం రెండు లేదా మూడు పప్పులతో కూడిన ఆహారం తినకుంటే ఇంత మేర ప్రొటీన్ అందదు. ఒక్క సోయాబీన్ తప్ప మనం వాడే కందిపప్పు, పెసలపప్పు వంటి వాటిలో పూర్తి స్థాయి ప్రొటీన్ లభించదు. అందువల్ల పేద ప్రజలందరికీ ఆహార చట్టం క్రింద పూర్తిస్థాయి ఆహారం అందించి తీరాలని పట్టుబడుతున్నాడు రాహుల్‌గాంధీ.

పేదరికం అంచుకు దిగువ వుండేవారికి ఇప్పటికే పలు రూపాలలో ప్రభుత్వం సబ్సిడీలు ఇస్తున్నది కాబట్టి, కొత్తగా ఆహారం సరఫరా చేసే బాధ్యతను నెత్తిన పెట్టుకోకూడదన్నది ప్రధాని భావన. కానీ మీరు చెప్పే పేదల పథకాలు నిజంగా వారి జీవితాలను బాగు చేయలేకపోతున్నాయి కాబట్టి, కనీసం వారికి కడుపు నిండా తిండి పెట్టడం ప్రభుత్వాల బాధ్యత, అందుకు ఎంత ఖర్చు అయినా పెట్టవలసిందే అని రాహుల్ వాదన.

ఈ చట్టం అమలులోకి వస్తే, ఆహారం విషయంలో మనం వూహించని మార్పులు ఎన్నో వస్తాయి. ఆహార చట్టం నమూనాను చూస్తే, భారతీయ సమాజంలో అదొక విప్లవం సృష్టించబోతుందన్పిస్తుంది. మావోయిస్టులు కూడా తమ ఆలోచనలలో సైతం సాహసించలేని రీతిలో సామాజిక నడవడిని మార్చి వేస్తుంది.

## గనుల్లో గిరిజనులకు వాటా

ప్రకృతి ప్రసాదించిన అపురూపమైన ఖనిజ వనరుల సంపదను కొల్లగొడుతున్న అక్రమార్కుల భరతం పట్టడానికి, అడవి తల్లి ముద్దుబిడ్డల వంటి గిరిజనులను మానవ రూపంలోని పారిశ్రామిక మృగాల నుంచి రక్షించడానికి రాహుల్‌గాంధీ తలపెట్టిన మృతసంజీవని ఔషధం గనుల నియంత్రణ చట్టం. మైన్స్ అండ్ మినరల్ డెవలప్‌మెంట్ అండ్ రెగ్యులేషన్ యాక్ట్ పేరిట రూపుదిద్దుకొంటున్న ఈ కొత్త చట్టం అమలైతే, కోట్లాది మంది గిరిజనుల జీవితాలు కొత్త వెలుగులతో నిండిపోతాయి. ఈ చట్టం ప్రకారం బాక్సైట్, ఇనుప రజను, మాంగనీసు వంటి ఖనిజాల గనులను స్వంతం చేసుకొనే పారిశ్రామిక సంస్థలు, తమ లాభాలలో 26 శాతాన్ని స్థానిక గిరిజనులకు పంచి పెట్టవలసి వుంటుంది. అదికాక, భూములు కోల్పోయే రైతులకు ఆ భూముల విలువ మేర తమ కంపెనీలలో షేర్లు కేటాయించాలి. ఆయా కంపెనీల నిర్ణయాలలో స్థానిక గిరిజనులు, రైతుల మాటకు విలువ ఇవ్వాలి. ఒకవేళ ఏ కారణం వల్లనైనా గనుల త్రవ్వకం నిలిపివేస్తే, ప్రభుత్వానికి చెల్లించే రాయల్టీతో సమానమైన మొత్తాన్ని ప్రతి ఏటా భూములిచ్చిన రైతులకు చెల్లించాలి. స్థానిక గిరిజనులకు గనులకు అనుబంధంగా స్థాపించే పరిశ్రమలలో తప్పనిసరిగా ఉద్యోగాలు ఇవ్వాలి. అందుకు అవసరమైన విద్యార్హత, వృత్తి నైపుణ్యత ఆ గిరిజనులకు లేకుంటే, ఆయా పరిశ్రమలే వారికి శిక్షణ ఇచ్చి మరీ ఉద్యోగాలివ్వాలి. ఫ్యాక్టరీ నిర్మాణంలో మట్టి చదును చేయడం, క్యాంటీన్లు నడపడం, చిన్న చిన్న కట్టడాలు కట్టడం వంటి పనులన్నిటినీ స్థానికులకే కాంట్రాక్ట్ ఇవ్వాలి. ఈ నిబంధనలన్నీ ప్రభుత్వం ద్వారా భూమిని సేకరించే వారికే కాకుండా, స్వంతంగా రైతుల నుంచి భూమి కొనుగోలు చేసే వారికి కూడా వర్తిస్తాయి.

ఈ కొత్త చట్టం పట్ల పారిశ్రామిక వర్గాలు గోల గోల చేస్తున్నాయి. ఈ నిబంధనలు అమలు చేసి గనులు నిర్వహించడం తమ తరం కాదని



మొత్తుకొంటున్నాయి. తమ లాభాలలో గిరిజనులకు వాటా పంచడమనే వూహనే భరించలేక పోతున్నారువారు. అయితే రాహుల్ గాంధీ మాత్రం రాజీ పడడం లేదు. ఈ చట్టం చేసి తీరాలని పట్టుబడుతున్నారు. అంతవరకు కొత్త గనుల కేటాయింపును రద్దు చేయాలని ఒత్తిడి తెచ్చి, వేదాంత, అన్‌రాక్, జిందాల్, పోస్కో టాటా వంటి సంస్థలకు ఇచ్చిన మైనింగ్ లైసెన్స్‌లను రద్దు చేయించాడు.

## కార్పొరేట్ బడిలో పేదవాడికి చదువు

నిరుపేదల బ్రతుకులలో మరొక వెలుగు దివ్వె – చదువుల చట్టం. మొన్న ఏప్రిల్‌లో పార్లమెంట్ ఆమోదం పొందిన ది రైట్ ఆఫ్ చిల్డ్రన్ టు ఫ్రీ అండ్ కంపల్సరీ ఎడ్యుకేషన్ యాక్ట్ – నిరక్షరాస్యత నిర్మూలనకు దివ్యాస్త్రం వలె పని చేస్తుందనడంలో సందేహం లేదు. ఈ చట్టం ప్రకారం 6 నుంచి 14 సంవత్సరాల వయస్సు వున్న ప్రతి బాల బాలికలకు ప్రభుత్వం తప్పనిసరిగా చదువు చెప్పించాలి. ఐదవ తరగతి వరకైతే ఆ పిల్లలు నివసించే ఇంటికి ఒక కిలోమీటర్ దూరంలో, ఆ పైన అయితే మూడు కిలోమీటర్ల దూరంలో తప్పనిసరిగా ఒక బడి తెరవాలి. పిల్లల సంఖ్య తగ్గిందని బడులు మూసి వేయడానికి లేదు. ఒక్క పిల్లవాడు బడికి వచ్చినాసరే బడి నడిపి తీరాలి. తమ గ్రామాలలో ఏ ఏ పిల్లలు బడులకు వెళ్లకుండా నిలిచిపోతున్నారో ఎప్పటికప్పుడు అధ్యయనం చేసి, వారిని బడులకు పంపే ఏర్పాటు చేసే బాధ్యత గ్రామ పంచాయితీలపై వుంటుంది. ఎవరైనా అందులో నిర్లక్ష్యం వహిస్తే, ఆ పంచాయితీ ఉద్యోగి లేదా సర్పంచ్ శిక్షార్హుడౌతాడు. నిర్బంధ విద్యా చట్టం క్రింద నడిచే స్కూళ్లలో చాలినంత మంది అధ్యాపకులను నియమించవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానిది. ఎప్పటికప్పుడు ఆలస్యం చేయకుండా టీచర్ల నియామకం చేపట్టాలి.

ఈ చట్టంలోని మరొక కీలకమైన అంశం – అన్ని ప్రైవేటు స్కూళ్లలో 25శాతం సీట్లను తప్పనిసరిగా పేద విద్యార్థులకు కేటాయించడం. తమ పిల్లవాడిని చేర్చుకోమని దళిత కుటుంబాలకు చెందిన, పేదలైన తల్లిదండ్రులు ఎంత పెద్ద ప్రైవేటు స్కూల్‌కు వెళ్లి అడిగినా, కులం మతం చూడకుండా సీటు ఇచ్చి తీరాలి. ఆ పిల్లవాడికి ప్రవేశ పరీక్ష పెట్టడం, ఇంటర్వ్యూ చేయడం వంటి అడ్డంకులు కల్పించ కూడదు. తరగతి గదులలో ఈ 25శాతం విద్యార్థులను వేరుగా పెట్టడం, సాధారణ సమయాలలో కాకుండా వారికి ప్రత్యేకంగా చదువు చెప్పే ప్రయత్నం చేయకూడదు. ఆ పిల్లలకు తతిమా వారితో సమానంగా యూనిఫాంలు, పుస్తకాలు కొనే స్తోమత లేకుంటే పాఠశాల యాజమాన్యమే వాటిని ఉచితంగా సరఫరా చేయాలి. ఏ పాఠశాల అయినా ఈ నిబంధన తప్పితే, మొదట తప్పుకు లక్ష రూపాయల పెనాల్టీ విధించవచ్చు. ఆ తర్వాత వారు తమ తప్పు సరిదిద్దుకొని, పేద పిల్లలకు 25 శాతం సీట్లు ఇచ్చేవరకు రోజుకు 10వేల రూపాయల లెక్కన పెనాల్టీ విధిస్తారు. దీనికి ఒప్పుకోని పాఠశాలను మూసివేస్తారు.

లక్షలలో ఫీజులు వసూలు చేసే ఖరీదైన ప్రైవేటు స్కూల్ యాజమాన్యాలు ఈ చట్టం పట్ల తీవ్ర అభ్యంతరాన్ని, ఆందోళనను వ్యక్తం చేస్తున్నాయి. కానీ రాహుల్‌గాంధీ ఏ మాత్రం మార్పులకు ఒప్పుకోవడం లేదు. అయితే ప్రైవేటు స్కూల్ యాజమాన్యాలు ఇందుకు తగినఏర్పాటు చేసుకోవడానికి మూడేళ్ల వ్యవధి మాత్రం ఇచ్చారు.

విద్యా హక్కు చట్టం అమలుకు రానున్న ఐదేళ్లలో లక్షా 70వేల కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా. ఇంత సొమ్ము భరించలేమని ప్రధాని మన్మోహన్‌సింగ్ అభ్యంతరం చెప్పారు. ఇదంతా వృథా ఖర్చని మొత్తుకున్నాడు. కానీ రాహుల్ గాంధీ విన్పించుకోలేదు. చట్టం చేసి తీరాలని పట్టుబట్టారు. నిజానికి నిర్బంధ విద్య అనే విధానాన్ని రాజ్యాంగంలోనే పొందుపరచి వుంది. కానీ ఇప్పటివరకు ఏ ప్రభుత్వం కూడా దాన్ని అమలుకు సాహసించలేకపోయింది. ఆ అసాధ్యాన్ని సుసాధ్యం చేశాడు రాహుల్‌గాంధీ. దేశంలో కోటి మంది పిల్లలు బడులకు వెళ్లకుండా బ్రతుకులను వ్యర్థం చేసుకొంటున్నారని అంచనా. వారందరి జీవితాలకు సార్థకత కల్పించబోతున్నది ఈ చట్టం. ఖరీదైన స్కూళ్లలో, సంపన్నులతో సమానంగా చదువుకోవాలనే నిరుపేదల కోరికను ఈడేర్చబోతున్నది.

## అందరికి ఆరోగ్యం ఉచితం

రాహుల్ గాంధీ తలపెడుతున్న మరొక నమ్మలేని నిజం, ఆరోగ్య చట్టం. దేశంలోని ఏ పౌరుడైనా అత్యవసర సమయాలలో తన దగ్గరలోని ఆస్పత్రికి వెళ్లి ఉచితంగా వైద్యం చేయించుకోవడం దీని లక్ష్యం. అత్యవసర సమయాలలో తమ ఆస్పత్రికి వచ్చిన రోగిని, డబ్బు అడగకుండా, బిల్లు వేయకుండా కనీసం

కొరవ 14వ పేజీలో

# ఉత్తరక్రియలు





జననం : 15-07-1949

మరణం : 10-10-2010

## శ్రీమతి నెల్లూరు సుదర్శనమ్మ గారు

నిరంతరం శ్రమకోర్చి మా అందరినీ ఉన్నత శిఖరాలకు చేర్చిన మీరు మమ్మల్ని దుఃఖ సాగరంలో ముంచి 10-10-2010 ఆదివారం నాడు తిరిగిరాని లోకాలకు తరలి వెళ్లారు. మీరు మాపై చూపిన ప్రేమానురాగాలు మా హృదయాంతరాలలో పదిల పరచుకొంటాం.

దివి నుంచి మీ ఆశీస్సులు సదా మాకు ఉండాలని కోరుకుంటూ...
మీ అత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తూ... శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

### భర్త : నెల్లూరు గోపాలరెడ్డి

| కుమారుడు - కోడలు | మనుమరాలు, మనుమడు | కుమార్తె - అల్లుడు | మనుమలు |
|---|---|---|---|
| నెల్లూరు విజయభాస్కర్‌రెడ్డి - ప్రమత | నెల్లూరు నిహారిక<br>నెల్లూరు అక్షయ్‌రెడ్డి | సామంతు విజయలక్ష్మి - డా॥ S.V.కృష్ణారెడ్డి<br>M.S., M.ch., Urologist<br>విజయ హాస్పిటల్, పొగతోట, నెల్లూరు. | సామంతు ప్రణీత్‌రెడ్డి<br>సామంతు ప్రీతమ్‌రెడ్డి |

ఉత్తరక్రియలు : తేది 20-10-2010 ది బుధవారం రామమూర్తినగర్‌లోని మా స్వగృహమునందు జరుగును.
సమయాభావం వలన బంధుమిత్రులకు పత్రికాముఖంగా తెలియజేస్తున్నాము.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.